" సాహిత్యలత "

21వ కుసుమము

# కధలు = కల్పనలు

గ్రంథకర్త
శ్రీ కర్లపాలెం కృష్ణరావు.

" సాహిత్యలత "

స్థాపితము: 1935 జనవరి

సంపాదకులు

శ్రీ కృష్ణరావు

1944 - మార్చి

ప్రథమ ముద్రణము

I have seen some of the " Sahityalata " publications edited by Mr. Karlapalem Krishna Row. They appear to be a definite contribution, to the current literature in Telugu. I wish the series of publications every success.

14—3—44 }
GUNTUR. }

(sd.) K. V. GOPALASWAMY, M. A.
BARISTER-AT-LAW.
REGISTRAR - ANDHRA UNIVERSITY.

## —: రాజపోషకులు :—

శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమదేవవర్మమహారాజులుంగారు
జయపురాధీశ్వరులు.
ఆంధ్రగీర్వాణసాహితీసామ్రాట్టులు

శ్రీ శ్రీ శ్రీ రాజా వెంకటాద్రిఅప్పారావు బహద్దర్
ఉయ్యూరు సంస్థానాధీశులు.

,, కుమారరాజా - నర్సరావుపేట.

,, కుమారరాజా - ఉయ్యూరు.

,, బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.

,, జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు, కారంచేడు

,, ఉప్పుటూరి వెంకటపున్నయ్యగారు,
యం. యల్. సి. గుంటూరు.

,, చీరాల వెంకటాద్రిపంతులుగారు, చీరాల.

,, ఈదర వెంకటాద్రిపంతులుగారు, ఏలూరు.

,, డి. యస్. మూర్తిగారు, గుంటూరు.

,, ఆర్. కె. యస్. గజపతిరాజుగారు, బియే. బియల్.
మేనేజింగ్ డైరెక్టరు, ఆంధ్రసిమెంటుకంపెనీ, బెజవాడ.

,, కూర్మా వేణుగోపాలస్వామిగారు, బార్-ఎట్-లా,
రిజిష్ట్రారు - ఆంధ్రయూనివర్సిటీ.

,, అరవపల్లి వెంకట్రావుగారు, మర్చంటు, గుంటూరు

,, పచ్చవ పాపయ్యచౌదరిగారు, భూస్వామి, బెజవాడ

,, రావుసాహేబు వల్లభనేని బాపయ్యచౌదరిగారు,
భూస్వాములు, గుడ్లవల్లేరు.

# సంపాదకీయము.

ఇది మహాకరవుకాలము, కాగితానికి మరీని- ఈపరిస్థితులలో గ్రంధమాల నడుపుట కష్టతరమని వేరుగ చెప్పవలెనా? ఎంతప్రయత్నించినను కాగితము లభించుట లేదు ఈసందర్భంలో యెందరో అధికారులను చూచి, అర్జీలు పెట్టుకొని చేయువలసిన ప్రయత్నమంతా చేశాము. గాని ఫలితము పూజ్యము. ఈకారణములవలన సకాలమునకు గ్రంథము లందజేయజాలక పోతిమి. కష్టసుఖములెరిగిన ఉదారహృదయులగు మాచందాదారు లిందులకు మన్నింతురుగాక!

ఈ "కథలు-కల్పనలు" మొదట 1935 సంవత్సరం మే నెలలో, సాహిత్యలత తృతీయకుసుమముగ "వ్యాసమంజరి" యనుపేరుతో ప్రచురింపబడినది. ఆప్రతులన్నియు అప్పుడే ఖర్చుపడిపోయినవి. మామిత్రులు కొందరు "వ్యాసమంజరి" యనుపేరు బాగుండలేదనియు, మార్చవలసినదనియు, కోరియుండిరి; మరియు, 1935 వ సంవత్సరముననున్న చందాదారులకుమాత్రమే "వ్యాసమంజరి" ముట్టినది గాని అటుపిమ్మటచేరిననూతనసభ్యులకుఅందియుండలేదు. అప్పటి సభ్యులుచాలమంది మానుకొనుటయు, యిప్పుడున్నవారిలో అధికసంఖ్యాకులు క్రొత్తవారగుటయు, అందు కొందరీ గ్రంథము కావలెనని కోరుటయు, గ్రంథమాలయం దిప్పుడీగ్రంథముద్రణకు కారణములు. వ్యాసమంజరి యను పేరు

మార్చి, గ్రంథమును సవరించి, సరిజూచి "కథలు_కల్పనలు" అను పేరుతో వేయించితిమి. ఈపేరుతో, ఈరూపమున వెలువడుట కిదియేప్రథమమగుట, ప్రథమముద్రణమనియే వ్యవహరింపవలసివచ్చినది. కథలు కావలెననికోరు చదువరు లధికముగనున్న యీకాలమున, "కథలు_కల్పనలు" వెలువరించుట సమంజసమని తలంచుచున్నాము.

ఒకవేళ చందాదారుల కెవరికైన మాగ్రంథము లందక తప్పిపోయినయెడల, మాకు తెలియజేసిన, వెంటనే వారికి మరల గ్రంథములు పంపుకొనగలము.

రెండు మూడు సంవత్సరములనుండియు చందాలు పంపని సభ్యులు కొందరున్నారు. వారిప్పటికైనను, తమ చందామొత్తమును పంపి గ్రంథమాల నాదరింతురుగాక! మాతృభాషావిషయికసంస్థలను ఆదరించుట తమకనీసధర్మమని ఆంధ్రులు గుర్తింతురుగాక!

రాబోవుగ్రంథము చరిత్రాత్మకమగునవల క్రొత్తనవల. త్వరలో చందాదారుల కందజేయగలము.

సాహిత్యలత
గుంటూరు

సంపాదకుడు.



# పోషకులు.

---

శ్రీ నూనె గోవిందరాజులుశ్రేష్టిగారు, ఆనరరీమేజస్ట్రేటు,
చీరాల.

రావుబహదూర్ గావుల సుబ్బారావుపంతులుగారు, చీరాల

దగ్గుపాటి పాపయ్యచౌదరిగారు, కారంచేడు.

గంజాం రాఘవాచార్యులుగారు, మెడికల్ ఆఫీసరు, ఒంగోలు

తుమ్మపూడి శ్రీరాములుగారు, మర్చంటు, గుంటూరు.

తుమ్మమూరి నరసింహారావుపంతులుగారు, గుంటూరు.

పులిపాటి రామారావుగారు, గుంటూరు.

ముప్పిరిశెట్టి పుల్లారావుగారు, మర్చంటు, గుంటూరు.

యస్. జనార్దనగుప్తగారు, మర్చంటు, గుంటూరు.

కొప్పరావూరి సత్యనారాయణకవిగారు, బెజవాడ.

టి. వి. రాఘవయ్యగారు, నేషనల్ యిండియన్ లైఫ్
ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బెజవాడ.

పి. వి. రాఘవయ్యగారు, ప్రెసిడెంటు, ఆంధ్రనావికసంఘం
బెజవాడ.

కె. భానుమూర్తిగారు, మెడికల్ ఆఫీసరు, కూచిపూడి.

కంచర్ల బ్రదర్సు, మర్చంట్సు, గుంటూరు.

తెటవర్తి నాగపోతరావుగారు, బందరు.

తెటవర్తి సీతారామయ్యగారు, మర్చంటు, రాజమండ్రి.

కనుమూరు కృష్ణారెడ్డిగారు, ప్రెసిడెంటు, పంచాయతీబోర్డు
ఘోకిప్రరు.

(౮)

## పోషకులు.

శ్రీ వీరమాచనేని గంగాధరరావుగారు, డోకిపర్రు.
వి. రామచంద్రరావుగారు, భూస్వాములు, గుడివాడ.
పునుకొల్లు సీతారామాంజనేయులుగారు, ప్రెశిడెంటు,
పంచాయతీబోర్డు, పెదపారుపూడి.
మొరసేని వెంకటేశ్వరరావుగారు, ముదినేపల్లి.
ప్రొప్రైటరు, కోటేశ్వర రైసు మిల్లు, పామర్రు.
తూములూరి వెంకటప్పయ్యగారు, ఉరుటూరు.
బొమ్మారెడ్డి సుబ్బారెడ్డిగారు, పామర్రు.
మాచిరాజు వెంకటేశ్వరరావుగారు, నిడుమోలు.
నందిపాటి వెంకటేశ్వర్లు రెడ్డిగారు, పామర్రు.
మండవ వెంకటరత్నంగారు, కపిలేశ్వరపురము.
పి. సూర్యనారాయణగారు, ఏజంటు—మెట్టూరుమల్సు—
మద్రాసు.
జంగాల బలరామస్వామిగారు,టుబాకోమర్చంటుగుంటూరు

కథలు_కల్పనలు.

# కల్లో పాసకులు

* * *

... "సింహాసనమునకు సమీపమున నొకవైపు బంగారు కణికెలు, మొహరీలు, వివిధనాణెములు, కండ్లకు మిరుమిట్లు గొలిపేటట్లు రాసులు రాసులుగ పోయబడినవి. మఱియొకవైపు, సూర్యచంద్రాదులసైతము ధిక్కరించుచు, మెఱపులతో, మహలంతయు ముంచివేయుచున్న వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య, నీల ప్రవాళములు, కుప్పలు కుప్పలుగ పోయబడినవి, కాపలా సైతము లేకుండ నిర్లక్ష్యముగ వదలివేయబడియున్నవి, — గాని, — వందలకొలది మనుష్యు లటునిటు తిరుగుచున్నారు. వాటివంక కన్నెత్తిచూచువారులేరు. ఎదురుగా, పెద్దత్రాసు వ్రేలాడుచున్నది. ముందుభాగమున, ఒకగజముపొడుగు మెట్లవరుస అమర్చబడి, వాని నానుకొని పల్లంలో బారులు బారులుగ, విలువగల కుర్చీలు, సోఫాలు, అమర్చబడి, మంత్రులు, కవులు, పండితులు, గాయకులు మున్నగువారు వారివారిస్థానములలో నున్నారు.

వామపార్శ్వాన, ప్రదర్శన శాలలో, ఆపూటనే వచ్చిన నీటిరంగుల చిత్రములు, నూనెరంగుల చిత్రములు మున్నగునవి సుందరముగ నమర్చబడియున్నవి. మహారాజు గారు బయలుదేరబోవుచున్నారని ప్రజలలో కోలాహలము బయలుదేరినది. దాసదాసీజనములప్రమత్తులై, వినయావిధేయతలతో సంచరించుచున్నారు. మహారాజు జన్మదినమని, —మహోత్సవము జరుగబోవుచున్నది......"

కృష్ణుడు తన లేఖినిని మేజామీదనుంచి, పేడినిట్టూర్పు విడచెను. ఒకమాటు దిశలుపరికించెను. ముంల లే: నిని దీసికొని, చివరభాగమును గడ్డముకానించి, ఏకాగ్రచిత్తముతో ఆలోచించుచుండెను.

అది కృష్ణమూర్తి శయనమందిరము. ఆగదిలో నతడు ఏకాంతముగా నున్నాడు. అతడు పేరెన్నికగన్న రసజ్ఞకవిశేఖరుడు. శ్రీమంతులయింటబుట్టిమహాభోగములనుభవిస్తున్నాడు. గదిలో నాలుగుగోడలకు, నేర్పరులు చిత్రించిన త్రివర్ణచిత్రపటములు వ్రేలాడుచున్నవి. నాలుగుకుర్చీలు, రెండుసోఫాలు, సమీపమున చిన్నచిన్నబల్లలమీద అత్తరులు, మున్నగు సువాసనద్రవ్యములు అమర్చిరి. ఎదురుగా ఒకజంటకు సరిపోవుపెద్ద పందిరిమంచము దోమతెరతో కట్టబడియున్నది. రాత్రితొమ్మిదిగంటలు కావచ్చింది.

సత్యవతి, సంస్కారప్రియుడగు నొక న్యాయవాది కూతురు. ఇంగ్లీషు చదువుకొనుచున్నప్పటికి, బాల్యంనుంచి, మాతృభాషను యెక్కువ ప్రేమించేది. సంగీతమామెసొమ్ము. విశేష వ్యయప్రయాసలకోర్చి ఆకళ నారాధిస్తున్నది. ఆమె సహజ సౌందర్యానికి, నాగరిక వేషము మరింత అందం తెచ్చి పెట్టింది. కృష్ణమూర్తి, సత్యవతి, ఒక్కకళాశాలలోనే చదువుకొన్నారు. ఇద్దరికి మంచిస్నేహం కుదిరింది. ఇద్దరు కలసి నిత్యం సాంధ్య విహారానికి వెళ్లుతుంటారు. తీరినప్పుడు ఆమె కృష్ణునింటికి పలుమార్లు వస్తూయుంటుంది. ఆమెకు పదహారేండ్లు దాటవచ్చినయి. ఇంకా వివాహము కాలేదు. ఇప్పుడిప్పుడే మంచిసంబంధాలు వస్తూన్నాయి.

పిండారబోసినట్లు వెన్నలగాస్తున్నది, సత్యవతి భోజనాదికముల ముగించుకొని, ఆకులు నమలుచు వెన్నెలలో అటునిటు తిరుగుచున్నది. ఆమె ముంగురులు మలయమారుతంతో, దోబూచులాడుచున్నవి. ప్రాణములున్న నల్లత్రాచువలె, పిరుదులవరకు వ్రేలాడుతున్న ఆమె వాలుజడ అటునిటు కదలుచున్నది. అమె కట్టుకొన్న ఊదారంగు పట్టుచీర వెన్నెలలో, తళతళ లాడుచు, చెక్కిళ్ళమీదబడి, గులాబిరంగు ఊదారంగు కలసి, వింతవింత అందాలను చూపిస్తున్నది. అటునిటు తిరుగుచున్న సత్యవతి యెందుకో తటాలున కృష్ణమూర్తి యింటికి బయలుదేరింది.

కృష్ణుడప్పుడే గడ్డము కానించియున్న కలమును తీసి వ్రాయబోవుచున్నాడు. ఇంతలో, గాలిబుడుతడు మధుర మైన సంగీతాన్ని తీసుకొని వచ్చాడు, వెనుకనుంచి,

" రేరాజు నీవంటు,

రేరాణి నేనంటు,

పాడుకొంటూ-మనము

ఆడుకొందామా ?"

అంటూ సత్యప్రవేశించింది. కృష్ణుని లేఖని అప్రయత్నంగా బల్లమీదికి జారింది, "ఈతప్పుల పద్యాలను యెంత శ్రమపడి నేర్చుకొన్నావు ?"-"అవును, దేవరవారు వ్రాసిన వన్నీ రైట్,—ఇతరులు వ్రాస్తే తప్పులతడిక. అంతేనా?" అంటూ మేజాబల్లమీద కాకితాలు నెట్టి కూర్చుంది సత్య.

" ఇదేమిటి ? కుర్చీలు లేవూ ? ఖాళిగా ?"

ఎవరికి గావాలి ? నీ కెదురుగా, సమీపములో యెత్తుగా కూర్చుంటాను.

"పోకిరి తనము........"

"సహజమేగా కుర్రతనంలో?"

"మాటలు నేర్చావు కోటలు దాటేటట్లు."

"తెలివితేటలు లేవా, పేటలు దాటేటట్లు?"

"అప్పుడే భోంచేసివచ్చావేమిటి, ఆకులు వేశావు?"

ఆహాఁ!

నేనో?

ఎందుకని? ప్రొద్దుబోయిందిగా?—ఏమిటావ్రాసేది?

ఏకాంకనాటకము

ఏంకథ?

అక్బరుచరిత్రిలోకొంత......సరేగాని పెళ్ళెప్పుడు?

సత్యకు, కనుబొమలుముడిపడ్డయి. చెక్కు లదిరినయి తటాలునదిగి, వాలుకుర్చీలోకూర్చొన్నది.

"కోపంవచ్చిందా?"

ఎందుకు?

మరెందుకు లేచిపోయినావు?

వసతిగా కూర్చోవచ్చునుగదాయని,

పెళ్లిమాట ఎత్తితేముడుచుకొంటావెందుకు? మీనాన్న గారు యేదో సంబంధము నిశ్చయించారుట?

అబ్బాయ్! నేననేకపర్యాయములుచెప్పాను,ఆమాట త్తొద్దని, మరోమాటు......

ఇది తప్పుమాటా? ఎందుకంతకోపం, అనవసరంగా?

సరిపడనిమాటలనడము తప్పుగదా?

ఏంసరిపడదు? చూద్దాం పెండ్లిజేసుకోవేమో?ఇలాంటి వాళ్లను చాలామందిని చూచాము

చూడు — బాగా చూడు —

"అబ్బ! ఎంతముట్టగూడని ముత్యమైనావు సత్యా!"

అంటూ తనకుర్చీని దగ్గరికి లాక్కొని,

"ఇదుగో! ఇటుచూడు, నామనవి ఏమిటంటే—"

చిరునవ్వుతో, "ఏమిటీ, నక్క—వినయాలు? దగ్గరి కొచ్చావేం?"

పోనీలే,నక్కనో,గిక్కనో-గాని నామనవికాస్త ...

అదుగో, అదే వద్దన్నాను, ఆ ఒక్కటే నీలోనున్న దుర్గుణము.

ఏమిటో?

పట్టుదల

పోనీ, నేనుపట్టుదలగలవాణ్ణిగదా అని నీవైనా తగ్గ గూడదూ?

"తగ్గేయున్నాను, ఏంజేస్తాను అంతకంటె?"

ఔను నీవు చాలామంచిదానవు. నామాటవిను—

"..................?"

పెండ్లిజేసుకొని సుఖంగావుండు

సరే-నామాటకూడా, వింటావా?

ఆఁ!

నాయిష్టమొచ్చినవాణ్ణి పెళ్ళిజేసుకొనుటకు సమ్మతిం చుతావా?

నా సమ్మతిమెందుకు ?

ఆఁ! అయితే; నాకుస్వతంత్రమున్నది. అందుకు మా తలిదండ్రులుగూడా కాదనరని నానమ్మకము.

కాబట్టి......?

కాబట్టి......?

అయ్యో! చెప్పు - నవ్వుతావెందుకు?

నాహృదయముమీద చెయ్యిబెట్టు......

ఎందుకు?

నిష్కళంకమైనదిగదూ?

కాదని ఎవరన్నారు?

అన్ని తెలిసినవారికి చెప్పుట కష్టము- నాయెడబాటు కోర్చుకొనగలవా?

కష్టమే

మరి నన్ను పెండ్లి జేసికొనమంటావేం?

నీవు సుఖపడుటకు

నీతోవుంటే సుఖపడనా?

“లోకసమ్మతముగాదు......”

పిచ్చిమాట- రసజ్ఞకవిశేఖరుడవుగదా? కళోపాసకు లిట్లు మాట్లాడుదురా?

ఎంత వింత? కళోపాసకులకు, కట్టుబాట్లులేవా? నా కవిత్వ మిందులకా?

ఇతరులను కష్టపెట్టే కవిత్వ మెందులకు?

ఎవరిని కష్టపెట్టాను?

నన్ను?

భ్రమపడుచున్నావు.

భ్రమగాదు, బాధపడుచున్నాను.

అబ్బ! అదేమిటో చెప్పరాదూ?

ఇంకా తేటతెల్లంగానా?...... నేనితరులను పెండ్లిజేసికోను.

ఆఁ! తర్వాత?

నీతో ఉంటాను.

ఏలావుంటావు? నేను నిన్ను పెండ్లిజేసికొననుగా?

ఇంతేనా? అక్బరుచరిత్రము వ్రాస్తున్నా వెందుకూ? అక్బరు ఎంతమంది స్త్రీలను సుఖపెట్టాడో తెలుసునా?

న్యాయసమ్మతంగా పెండ్లి జేసుకొన్నాడు.

నీవాలాగే చెయ్యి?

సరే! ఈకరువుకాలంలో ఒకదాన్ని పోషించడమే కష్టం.

మీాయిద్దరినిగూడా నేనే పోషిస్తాను.

అది నీచము

పోనీ-నాపొట్టకు నేనుసంపాదించుకొంటాను

అదిఅంతకంటేను, ఇవన్ని యెందులకు సాగనిమాటలు?

సాగవా

అనిలేచి తెప్పపాటులో కృష్ణుడికాళ్ళముందు పడ్డది. అప్పుడే కన్నీళ్ళు కాలువలుగట్టి అతని పాదాలు తడిపినయి. అతడు ఆమెను లేవనెత్తాడు. ఆమె కృష్ణుని చేతులమీద వాలబడ్డది. వదనమెర్రిబారింది.

"నీవురాతుసుడవు" అన్నది. కృష్ణు డామెను వొళ్ళో కూర్చోబెట్టుకొని, ముంగురులను సర్దుతూ, "సత్యా పసిదానవు — దూరంమాలోచించుట మే" లన్నాడు.

"నీతిపాఠాలనవసరము. నన్ను పెళ్లి జేసుకొంటావా? లేదా?"

ఆలోచించుట కవకాశమీయవూ?

సంవత్సరమునుంచి ఆలోచిస్తునేయున్నావు—వ్యవధి చాలదు, తేల్చిచెప్పు.

"................."

మరి నన్ను చూడబోవుసుమా?

కృష్ణుడి కండ్లవెంట రెండు నీటిబిందువులు రాలినవి. ఒకరికండ్లల్లో ఒకరు చూచుకొన్నారు.

"అబ్బ! అసాధ్యపు ప్రశ్న" అన్నాడు

సులభ సాధ్యమే!

కష్టము......

సరే...చెప్పు...?

"...................."?

మాట్లాడవేం?

కష్టము...

చివాలున లేచి, విదిలించుకొని, త్వరత్వరగా నడిచి గదిదాటిపోయింది సత్య......కృష్ణుడామెను చెప్పవాల్పక చూస్తూ నిలువబడ్డాడు. ఆమె తన యింటిదారి బట్టింది.

ఉభయుల గృహములు సమీపములోనే యున్నవి. పదకొండుగంటలు కొట్టారు. కృష్ణుని కనేక ఆలోచనలుదయించినయి. అత డాపూట భోజనమునకు రానని చెప్పి, సౌధోపరిభాగాన మడతమంచము వేయించి పడుకొన్నాడు. ఎందుకో సత్యవతిగారింటికి పోదామని బుద్ధిపుట్టింది. లేచి, వడివడిగా వెళ్ళాడు. సత్యవతితండ్రి అప్పుడే తలుపులు వేయబోతున్నారు —కృష్ణునిజూచి "ఇప్పుడు వచ్చారేం? గదిలో పడుకున్నది. వెళ్ళండి" అన్నాడు. కృష్ణుడు సరాసరి సత్య గదిలోకి వెళ్ళాడు.

సత్యవతిపడుకోలేదు, కుర్చీలోకూర్చొని జాబువ్రాస్తున్నది. కృష్ణుడు ప్రవేశించినంతనే సత్య అతన్నిజూచి వెలవెలబోయింది. వ్రాయుచున్న కాకితము నలిపి వేయుచున్నది. అతడు కలియబడిజాబుబలవంతముగాలాగుకొన్నాడు. సత్య లేచివెళ్ళి సమీపంలో తనమంచంమీద పడుకొని నిలువెల్ల గుడ్డకప్పుకొన్నది. అతడాజాబును చూచుకొన్నాడు. ఆమెను సమీపించి ముసుగుతులాగి చూచాడు. ఆమె వెక్కి వెక్కి ఏడ్చుచున్నది. అతడికి నోట మాట రాలేదు. ఆతురతతో గూడిన భయమతనిని యావరించినది వడివడిగా మందువా లోనికేగి, సత్యవతితండ్రితోజెప్పి డాక్టరుగారికొఅకుకారుబంపించాడు. ఆమెతల్లిదండ్రులు, కృష్ణమూర్తికలసి సత్యవతిగదిలోనికివచ్చారు. తల్లికంటనీరిడుతున్నది. తండ్రిహీనస్వరంతో పిలుస్తున్నాడు. కృష్ణుడు, సత్యవతిహృదయానికితనహృదయాన్నియానించి గట్టిగాపట్టుకొనిపడుకొన్నాడు. ఒకక్షణము జరిగింది. అంతా నిశ్శబ్దము. కృష్ణుడుగూడ పిలి స్తేపలుకుటలేదు

ఇంతలో డాక్టరు వచ్చాడు. కృష్ణుడిని క్రిందికి లాగి డాక్టరుసలహానను సరించి ఫాలభాగమును తడిగుడ్డతో తుడుపుచున్నారు. డాక్టరు సత్యవతిని పరీక్షించి, గ్లాసులో మందు కలిపి కొంత త్రాగించేడు. ఇకలాభంలేదనుకొని సూదిమందు ఎక్కించి "సత్యవతి విషము తిన్నదని, తాను విరుగుడు పెట్టా

సనిన్ని ఒకగంటలో ఆమె లేచి తిరుగగలదని" చెప్పి వెళ్ళి పోయినాడు, డాక్టరు. కృష్ణుడికి సత్యకు సేవజేస్తూ, తల్లి దండ్రులు సేవకులు అక్కడేయున్నారు. కొంతసేపుగడిచింది తెల్లవారబోతున్నది.

కృష్ణుడు, సత్య, లేచిరిగాని, ఒకరినొకరు పలుకరించు కొనలేదు. ఎవరేమడిగినా ఇద్దరు సమాధానం జెప్పాటలేదు. తెల్లవారింది. కృష్ణుడు తనయింటికితానునిశ్శబ్దంగావెళ్ళాడు. ఉభయుల గృహముల్లోను, "ఈతెప్పెవరిది? ఇలా యెందుకు జరిగింది?" అన్నేప్రశ్నలుదయించి కలవరపరుస్తున్నాయి.

సత్యవతి కృష్ణుడికి అపాయము చేయ తలపెట్టిందని వాళ్ళయింట్లోవాళ్ళన్నారు.

కృష్ణుడామెకు మందుపెట్టాడని వీళ్ల యింట్లోవాళ్ళ న్నారు. ఇద్దరిస్నేహము చూచి సహించలేక పెద్దవాళ్ళే యీపనిజేసివుంటారని గ్రామంలో కొందరు అనుకొన్నారు.

నాల్గురోజులు గతించినయి. ఒకనాడు తెల్లవారేసరికి సత్యవతియెక్కడికో చెప్పకుండా లేచిపోయిందనిఅనుకొన్నారు. ఆరాత్రికృష్ణమూర్తియెవ్వరికితెలియకుండా రైలుయెక్కాడు. ఇద్దరుకలిసి, లేచిపోయినారుఅని ఊళ్ళోఅల్లరిప్రారంభమైనది. రెండుకుటుంబాలలోనుంచి వెతుకుటకు మనుష్యులు బయలు దేరి వెళ్ళారు. పందలకొలది రూపాయలు ఖర్చుపెట్టుకొని, తిరిగి తిరిగి వచ్చారు; లాభంలేకపోయింది;

రెండు సంవత్సరాలు దాటినయి. క్రమక్రమంగా సత్యవతి కృష్ణులమాటలు మరచిపోతున్నారు. ఊళ్లోవాళ్ళుగానితల్లిదండ్రులు లోలోన, కుమిలిపోతున్నారు. ఇంకావాళ్లను పట్టుకోవాలని విచారిస్తూనేయున్నారు.

గోపాలాచారిగారి నాటకాలు చాలాప్రఖ్యాతిగాంచినయి. వాళ్ళ "ఇంకా యిలాంటి నాటకాలేనా?" అనే నాటకము ముఖ్యంగా చూడదగింది. నాటకసమాజంవారు దక్షిణదేశమంతా తిరిగి దారిలో బెజవాడలో దిగారు. దుర్గాకళామందిరములో ఒకప్రదర్శనమేనని, స్త్రీలే స్త్రీవేషములు వేస్తారన్ని ప్రకటించారు. వారిలో "హేమలత" వేసే శ్రీదేవి చూడదగినదని అందరు చెప్పుకొంటున్నారు.

రాత్రితొమ్మిదిగంటలయింది. హాలంతానిండిపోయింది. క్రమప్రకారం నాటకంప్రారంభించారు. అందరు నిశ్శబ్దంగా వింటున్నారు. రెండుమూడురంగాలు జరిగేవరకు నాటకం మహారక్తికట్టింది. నాలుగోరంగంలో "హేమలత"(శ్రీదేవి) ప్రవేశించి తన అపూర్వనటనాకౌశలమును చూపిస్తూ, విమలగానామృతవాహినిలో, సభికులను ముంచిలేవనెత్తుతున్నది వరుసగా అన్నిరంగాలు ఉత్సాహంతో నడచిపోతున్నాయి. తక్కిన వేషధారులుగూడ ప్రజ్ఞావంతులే. నాటకం పూర్తియైంది. ప్రేక్షకులు యెవరి త్రోవను వారు, చెప్పుకుంటూ గృహోన్ముఖులైరి.

"శశ" పత్రికాధిపతులట, శ్రీదేవిచిత్రముగావలెనని వచ్చారు" అని మేనేజరుతో జెప్పాడు సేవకుడు. మేనేజరు పత్రికాధిపతితో, తనపరిచయముకలుగ జేసుకొని, పిమ్మట శ్రీదేవిగదికి తోడ్కొనిపోయి యెఱుకపరిచాడు. శ్రీదేవి పత్రికాధిపతినిజూచి, నిశ్చేష్టురాలై,ఒకక్షణముండెను. ఆమె శరీరము కంపించినది- తనరక్తనాళమునందొక యర్థముగాని దివ్యతేజము ప్రవేశించినట్లు, ఆమెకు తోచింది. అనంతర మామె తెప్పరిల్లి వారి కుచితాసనము జూపినది. పత్రికాధిపతి, "ప్రచురణార్థము తనకు కొన్ని చిత్రము లీయవలసిన" దని శ్రీదేవిని కోరాడు. "రేపుసాయంకాలము రావలసిన" దని శ్రీదేవి నిర్లక్ష్యముగ సమాధానము చెప్పి, తన పని జూచుకొనుచున్నదానివలె, నటించినది. పత్రికాధిపతి సెల వుదీసికొని లేచి వెళ్ళాడు.

సాయంకాలమునాలుగుగంటలు కావచ్చింది. శ్రీదేవి చక్కగ అలంకరించుకొని, రతీదేవివలె సోఫాలోగూర్చొని శ్రీనాథునికావ్యాలు చూస్తూయున్నది. మరికొన్ని సోఫాలు నల్లబల్లలు, చిత్రపటములుగదినిండాయున్నవి. సేవకుడప్పుడే వచ్చి గులాబీషర్బత్తుసీసా దెచ్చి బల్లమీదనుంచి వెళ్ళాడు. ఆగదిలో ఆమెదప్ప మరెవ్వరులేరు. కొంతకాలమైనతర్వాత యెందుకో శ్రీదేవి లేచి పెట్టెదీసి సర్దుతున్నది. ఇంతలో

పత్రికాధిపతి వచ్చి నిలువబడ్డాడు. శ్రీదేవి, "నమస్కారములు— దయచేయండి!" అన్నది. పత్రికాధిపతి తలవని తలంపుగా వెళ్ళి, శ్రీదేవి పాదాలుపట్టుకుని, నులివెచ్చటి కన్నీటితో ఆమెపాదాలు తడిపివేశాడు. శ్రీదేవి అతనిని లేవదీసి, నవ్వుచు, "పెద్దవారిట్లు జేయవచ్చునా? నేనెవతెనని మీయూహ!" అన్నది.

పత్రికాధిపతి "ఇంకా మోసమెందుకు? నా తెలివి తక్కువే యింతదూరం తెచ్చింది క్షమించు" అన్నాడు.

శ్రీదేవి:— వింతమాటలు? మీదేయూరు? భ్రమపడుచున్నారా?

పత్రి:— .............. ?

శ్రీదేవి:— మాట్లాడరేమి?

పత్రికా:— సత్యా! ఎందుకింకా దాచిపెడతావు? "నేను కృష్ణమూర్తిని — నీవు సత్యవతివి"

అంటూ ఆమెనుకౌగలించుకొన్నాడు. "తప్పుసుమా! లోకసమ్మతముగాదు" అని ఆమె కృష్ణుని చెక్కిలిగొట్టింది.

పదిరోజులకల్లా పరిణయమహోత్సవం జరిగింది. పెద్దలఆశీర్వచనలతో, అన్నిపత్రికలు నిండిపోయాయి.

———

# నిరుద్యోగులకు గిరీశంగారి సలహా

---

అప్పటినుండి అంటే—"కన్యాశుల్కము"లో మనము చూచినప్పటినుండి, గిరీశం హాయిగా బుచ్చమ్మతో కాలక్షేపము చేస్తున్నాడు. వెంకటేశాన్ని చదువుసంధ్యల వ్యవహారమెట్లావున్నను లంకాకుచుట్టలు చుట్టిపెట్టడములో మాత్రము ప్రవీణుణ్ణిజేశాడు గిరీశము. ఈముగ్గురు ఏక కుటుంబీకులుగానుండి అప్పటినుంచి ఇప్పటివరకు ఎన్నిఅవాంతరాలు వచ్చినా సమర్థించుకొంటూ కాలప్రవాహానికి ఎదురీదుతున్నారు. నిరుద్యోగపు డిపార్టుమెంటు పుట్టిననాటినుండి గిరీశం ఆడిపార్టుమెంటునే నమ్ముకొని పడియున్నాడు. ఆడిపార్టుమెంటులో తదాది కొంతమంది ప్రవేశించి కొన్నాళ్ళుండి మరొకలైను తొక్కడముమామూలు అయిపోయిందిగాని, గిరీశంమాత్రం వదలకుండా సర్వీస్ననుసరించి పెత్తనదారుఅయినాడు. ఇతడనేకరకాల వ్యాపారాలు జేసేవాడు. నల్లులమందు—తేళ్ళమందు—వశీకరణలేహ్యము—వల్లకాటిలేహ్యము--ఇత్యాదులు—ఒకటేమిటి? ఎన్నిరకాల వ్యాపారాలో సాగించి డబ్బుసంపాదించి తానుతిని, ఒకరికిపెట్టాడు. కొన్నాళ్ళు పరీక్షకుపోయ్యేవిద్యార్థులకు ఉద్యోగాలుకావలసిన యువకులకు బిరుదులు కావలసిన పెద్దమనుష్యులకు తాయిత్తులు కట్టి రొక్కము గణించాడు.

ఒకనాడు శయనమందిరములో గిరీశం బుచ్చమ్మతో సరస సల్లాపాలాడుతుండగా బుచ్చమ్మ "పంతులుగారూ! తాము యీవిధంగా దొంగతాయిత్తులు కట్టి ప్రజల మోస గించి ధనమార్జించుట వంచిపనా?" అని అడిగింది. అంతట గిరీశం యీ లెక్చరు కొట్టాడు.

"డామిట్! మీ పమేమిటి? ఇలాంటిమాటలు మాట్లా డితే నీవు నాగరక ప్రపంచానికి పనికిరావు. కాబట్టి నిన్ను వదలివేయవలసివస్తుంది సుమా! తెలిసిందా? మైడియర్ బుచ్చమ్మా! ఇలాచూడు—మోసమంటావే ఏమిటి? ప్రపం చకమంతా మోసంగాదూ? ఇలాంటిపనులు పెద్దవాళ్ళుజేస్తే వ్యాపారమని, వ్యవహారమని, అంటారు—చిన్నవాళ్ళుజేస్తే మోసమని దొంగతనమని అంటారు, పెద్ద, చిన్న, అనేభేద ముతో అందరు దొంగలే. ఇటుచూడు.—పిల్లలకు పరీక్షలు పేపర్లు అమ్ముకొనే మేష్టర్లదిమోసంగాదూ? లోకంలోవున్న అబద్ధాలన్నీచెప్పి దొంగసలహాలిచ్చి ఫీజుగుంజే ప్లీడర్లది మోసంగాదూ; సప్తాహాలుచేయిస్తాననిన్ని గుళ్లుకట్టిస్తాననిన్ని చెప్పి చందాలువసూలుచేసి దిగమింగే పెద్దమనుష్యులది మోసంగాదూ? గ్రంథకర్తలయొద్ద కమీషను పుచ్చుకొను చున్న కొందరిహెడ్‌మాష్టర్లది మోసంగాదూ? ఇన్నెందుకు? లంచాలులేకుండా యేపని జరుగుచున్నది? ఈ లంచగొండి

తనము దేశమంతటా, అంటువ్యాధివలె వ్యాపించిపోయింది. తండ్రికొడుకుల మధ్య—భార్యాభర్తలమధ్య—భక్తుడికి దేవుడికి మధ్య—యీలాంచమే ప్రత్యక్షమై మారుపేర్లతో చలామణి అగుచున్నది. కాబట్టి ఈమాటలిక చాలించు-ఏ వ్యవహారమైనా కొంచెం లౌక్యంగా ప్రవర్తిస్తే యేచిక్కురాదు ......ఏమిటలానవ్వుతావు? ఆఁ! నీవునవ్వితే అదోవిధంగా అమాయకత్వం......ఇలారా, మరి......ఒక్కటి.

బుచ్చి:- చాల్లేద్దురూ? వేళాపాళ లేదు. బ్రాహ్మణీకమంతా పాడుజేసి...

గిరీ:- మనం పాడుజేసేదేమిటి? బ్రాహ్మలే పాడుజేసుకొన్నారు బ్రాహ్మణీకాన్ని.. అదుగో! నీవుమాత్రం సరిగా జరిపి యేడ్చావు? రమ్మనమని పిలవగానే లేచి నావెంటబడి వచ్చావుగదా?

బుచ్చి:- ఔను, నాదేతప్పు, మీ మాటలు నమ్మి మోసపోయినాను.

గిరీ:- అదుగో! మళ్లీ మోసమంటావేమిటి!...సరే, అయిందేమో అయిందిగాని, యిప్పుడులేచిపోతావా...ఆఁ! ఆఁ! నన్ను తాకగూడదు. దూరంగావుండాలి.

బుచ్చి:- అబ్బ! ఎన్ని నేర్చారండి!

గిరీ:- ఎన్ని నేర్వాండే, ఈ ఆడదయ్యాలున్న ప్రపంచకంలో

బ్రతుక గలుగుతాను? ...ఇప్పుడింకో తమాషా చేయబోతున్నాను చూడు.

బుచ్చ:- చెప్పండి వింటాను.

గిరీ:- అలా చెప్పను. చేసినతర్వాత చూచి, మెచ్చుకోవలసిందే.

బుచ్చ:- సరే, లేవండి ఇక్కడినుంచి— ఈ మాటలతో అయ్యేదేమిటి!

ఇలా నాలుగురోజులు గడిచినయి. గిరీశం బుర్రగలవాడనితలంచి, తమకేదైనా మార్గంచూపుతాడని, పనిపాటలులేని గ్రాడ్యుయేట్లు, కొందరువచ్చి, గిరీశాన్ని ఆశ్రయించారు. బుచ్చమ్మగూడా "పాపం! వాళ్ళకేదైనా జీవనోపాధి గలిగించండి. మీపేరుచెప్పుకొని బ్రతుకుతారు" అని శిఫార్సు చేసింది, గిరీశం వాళ్ళందరికి ధైర్యము చెప్పి పంపివేశాడు.

గిరీశం మరుసటిదినం అన్నివార్తాపత్రికలకు జాబులు వ్రాశాడు. తెల్లవారేటప్పటికి అన్ని వార్తాపత్రికలలోను.

"నిరుద్యోగులకుమాత్రము, ధనము సంపాదించుకొనుటకు, సులభమైన మార్గముచూపబడును. ప్రతిదరఖాస్తుదారు, తాను నిరుద్యోగియని తెలియజేయు ధృవపత్రమున్ను రెండుఅణాలతపాలాబిళ్లలున్ను, దరఖాస్తువెంట బంపుకొనవలెను. ధృవపత్రములులేని దరఖాస్తులు అంగీకరింపబడవు"

ఇట్లు గిరీశం—

అని పెద్ద పెద్ద యక్షరములతో ప్రకటింపఁబడినది. ప్రకటనానంతరము ఒక వారమురోజులలోగా, 950 దరఖాస్తులు గిరీశంగారికి చేరినయి. అతడు మహదానందంతో బుచ్చమ్మనుబిల్చి, "చూచావా! ఆయాసపడకుండా, రెండు వేల్లగ్రాసం సంపాదించుకొన్నాను" అన్నాడు.

"ఇన్నిదరఖాస్తులు యెలా వచ్చినయండీ?"

"ఊరుకొక వెర్రివాడుంటే చాలదూ?"

"పంతులుగారూ! ఈ అన్యాయార్జితం..."

"చిత్తం! బుచ్చమ్మగారూ! ఇలాంటి తెలివితక్కువ మాటలు చాలించి, తమరు వంటయింట్లోకి దయచేయండి" అని గిరీశం పరిహాసంగా అన్నాడు.

తరువాత వార్తాపత్రికలలో

"ధనముసంపాదించుకొనుటకు ఇలాంటివే సులభోపాయాలు."—

అని గిరీశం ప్రకటించాడు. ఇదిచూచి దరఖాస్తుదారులు నాలుకలు కొరుక్కొన్నారు.



# " గిరీశంగారి బహుమానము "

* * *

మహానుభావుడు అప్పారావుగారు, యేనాడు ప్రసాదించాడో యీ గిరీశాన్ని ఆంధ్రిలోకానికి, ఆనాటినుండి ఈ నాటివరకు, గిరీశం నిర్విచారంగా విహరిస్తున్నాడు. గిరీశం మహా తెలివితేటలుగలవాడేగాని, చపలచిత్తుడు. ఒకమాట-ఒకనీతి-ఒక కట్టుబాటు అనేవిలేవు. అతనినోటికి తలుపుద్వారబంధములు లేవు. ఎవరినిబడితేవారిని యెంతమాటైనాఅనేస్తాడు. మంచి ధైర్యసాహసాలు గలమనిషి. ఒకరి మాటెందుకు? గిరీశం భగవంతుడికే పాఠాలు నేర్పుతానన్నాడు. "ఉపాయంలేనివాళ్లని వూళ్లోనుంచి వెళ్లగొడతాననేవాడు. ఆంధ్రిదేశంలో గిరీశాన్ని యెరుగనివాళ్ళులేరు. ఈతనికథలు అందరు శ్రిద్ధతో వింటారు. ఇతనిచరిత్రి యింటింటాచదువుతుంటారు. గిరీశమంటే ప్రతివాడికి హడలే.

ఈనాడు ధనము పరిపాలిస్తున్నది. ధనవంతుడే రాజు. ధనవంతుడే శాసనకర్త. మధురకవితావిలసితుడై, మహీవలయమేలదగిన కవిసార్వభౌముడైనను, ధనములేకపోయిన యెందుకుపనికిరాడు. అసమానమైనమేధాశక్తిని లిగిలోకాన్ని ఉద్ధరించగల ప్రసిద్ధనవలారచయితయైనను, ధనహీనుడైన, దేనికిని కొరగాడు. కఠినశిలాతతులు సైతము, కరిగిపొయ్యే

టట్లు మధురగానముసేయు గాయకుడైనను, దరిద్రుడైన అప్రయోజకుడగును. లౌకికజ్ఞానసంపన్నుడై, యేమదీవ్రులేల దగిన ప్రతిభాశాలియైనను, విత్తములేకున్న పలుకరించువా రుండరు. ఎంత తెలివితేటలున్నను పేదవా డెవ్వరికి సరిపడడు అతడికి సభల కాహ్వాన ముండదు. టీపార్టిలకు బిలుచువా రుండరు. సంఘమున గౌరవము లేదు. పెండ్లిండ్ల కేగిన మర్యాద లేదు. ప్రజలలో పలుకుబడి లేదు. ఇన్నెందుకు? నాగరకప్రపంచమున నతనికి స్థానమేలేదు. తుట్టతుదకుదైవ మును దర్శించుటకుగూడ అతని కర్హత లేదు. పూజారికి చె ల్లించవలసినముడుపు చెల్లించకున్న భగవంతుని శిలామయవి గ్రహముగూడ అతడు చూడగూడదు. బంధుమిత్రులు లేరు. భార్యాపుత్రులు లేరు___ అంతయు ధనమే.

ప్రతివాడికి తా నొక గొప్ప అధికారి కావలెనని, ప్రతివాడును, శాసనకర్తయైముద్రాధికారమువహించి, పెత్త నము చెలాయించవలెననిఅనుకొంటాడు. తనకంతటి తెలివి తే టలు, శక్తిసామర్థ్యాలు వున్నవా లేవా అనివిచారించుకోడు. ఉన్నతాసనము లభిస్తేచాలు. అసమర్థుడై, ప్రజలచేత, ప్ర భుత్వమువారిచేత, చీవాట్లుతినుటకైనా సిద్ధపడతాడు. ధన వంతుడైతేచాలు, యీ కాలంలో ప్రతివాడు మెలకనులో పాల్గొని, యేస్థానిక మండలాధికారోగావొచ్చు, చేయరాని

పనులన్నీ చేసి, నీచాతినీచముగా ప్రవర్తించి, తుదకు అధికారము రాగానే యివన్నీ మరచిపోతాడు. అప్పుడు కన్నుమిన్ను తెలియదు. బీదా, బక్కా, కనబడరు. మంచి, చెడ్డ అనే జ్ఞానం నశించిపోతుంది. ప్రపంచమంతా తల్లక్రిందులుగా కనబడుతుంది. ఆ అధికారమూడిందాకా ఆతిక్క దిగదు.

పుల్లయ్య జిల్లాబోర్డు యెన్నికలలో పాల్గొని వేలకు వేల రూపాయిలు ఖర్చుపెట్టి, విజయలక్ష్మిని చేపట్టాడు. విజయవిరాజితుడగు పుల్లయ్యను జూచుట కనేక మిత్రులు వస్తున్నారు. జిల్లాయందన్ని గ్రామాదులవారును, ఆతనికి స్వాగతమిచ్చి, విందులను జేస్తున్నారు. అతని కరస్పర్శనభాగ్యాన్ని గోరని వారా జిల్లాలో లేరనియే చెప్పవచ్చును. పుల్లయ్య నంతకు పూర్వమసహ్యించుకునే విరోధులుగూడ, లోలోన నిందించుకొనుచున్నను ప్రత్యక్షమున నతనికి లోబడిపోయినారు. ఎవరెన్ని యనుకొంటేనేమి? అత్యున్నతమగు గౌరవాసనమధిష్ఠించు భాగ్యమతనికి లభించింది. తనకు జరుగుచున్న టీపార్టీలకును, వినోదములకును, స్తోత్రపాఠములకును, పుల్లయ్య ఉబ్బితబ్బిబ్బైపోవుచుండెను. ఒకనాడు పలువురు మిత్రులతో పుల్లయ్య సౌధాంతర్భాగాన గూర్చొనియుండగా, అతని దర్శనార్థము గిరీశముగారు వచ్చారు. ఎక్కడికిబడితే, అక్కడికి, సరాసరి వెళ్లిపోవడమేగాని, జంకు, గొంకు లేదు గిరీశానికి.

అతడు నేరుగా లోనికేగి పుల్లయ్యనుజూచి. "గుడ్‌మార్నింగ్ సార్!" అన్నాడు. పుల్లయ్య వెంటనే లేచి, "గిరీశంగారా?" అనుచు కరస్పర్శనజేసి, యుచితాసన మిచ్చాడు. పిమ్మట, గిరీశం, పుల్లయ్యను యింద్రుడని, చంద్రుడని పొగడి, "పుల్లయ్యగారూ! గౌరవార్థము మీకు, కొన్ని బహుమానాలు గొనివచ్చాను" అంటూ సుందరముగానిర్మింపబడిన ఒక గంధపుపెట్టెను చేతికిచ్చాడు. పుల్లయ్య అధికసంతోషంతో ఆపెట్టెను తెరచిచూచాడు. అందులో ఒకచేతిగడియారము ఒకఫౌంటెన్‌పెన్, ఒకకళ్ళజోడు ఉన్నాయి. ఆగడియారము "కీప్‌సేక్" కంటె సుందరంగావుంది. కళ్ళజోడు అందంగానే వున్నదిగాని, అద్దాలులేకుండా, చట్టము(Frame)మాత్రమే వున్నది. పుల్లయ్యచేతిలోనుంచి, ఆవస్తువులను ఆతనిమిత్రులు తీసుకొని చూస్తున్నారు. "అయ్యా! ఈగడియారము ఆడేది కాదండీ! బొమ్మలగడియారమనుకొంటాను" అని ఒకమిత్రుడన్నాడు. ఇంకోమిత్రుడు "ఈకలము వ్రాయుటకు పనికిరాదండీ!" అన్నాడు. అందరు పకపక నవ్వారు. పుల్లయ్యకు కోపమువచ్చింది. "ఏమి గిరీశం! నీకింతపొగరా? నన్ను అవమానపరచ దలచుకొంటివా?" అన్నాడు. అంతట గిరీశం "చిత్తం, క్షమించాలి, నాతప్పులేదు. నేను సక్రమముగానే బహూకరించాను. ఏమంటారా? మీకు గంటలు జూచుట

చేతగాదనియు, మంచిగడియారం మిస్త్రీ వాడుకొనే పద్ధతి తెలియక చెడగొట్టుకుంటారనియు, అలాంటి గడియారము తెచ్చాను. మీరు చదువుకొన్నవారుగాకపోవుటచేత, వినోదార్థము జేబులో పెట్టుకొనుటకు మాత్రమే పనికివచ్చు కలమునుయిచ్చాను ఇక కళ్ళజోడుసంగతి అడుగుతారా? అసలే అధికారగర్వంతో నున్న మీ కళ్ళకు, ప్రపంచమంతా తల్లక్రిందులుగా కనపడుతుందిగదా? గ్లాసులు మఱింతఅంధకారాన్ని కలిగిస్తయ్యేమోనని, అద్దములేని కళ్ళజోడు సమర్పించుకొన్నాను. యిందులో నాదోష మేమున్నది?"

అని గిరీశం, సవినయంగా అన్నాడు. పుల్లయ్య తెల్లబోయి అట్లాగే చూస్తున్నాడు.

# వ్రతప్రభావమా?

సుశీల :— పిల్లా! మీ అత్తగారు శ్రావణపట్టీ బంపేరు చూచేవా!

ప్రభావతి:— శ్రావణపట్టీ అంటే యేమిటే? అమ్మా!

సుశీల:—అంటే యేమిటా? దీనిచరిత్ర చాలావుంది. పూర్వం శ్రావణపట్టీలు లేవు. ఇప్పటి నవనాగరికులు సృష్టించేరు వీటినే. పరిణయమైన పిమ్మట పిల్లను అత్తవారి ఇంటికి తీసుకొని పోవడానికి ఉపదేశముగల్పించి అత్తవారింటికి ఆచార వ్యవహారాలు, వేషభాషలు, మర్యాద మన్ననలు, అనుభవంలో తెలుసుకొనుటకు ప్రసిద్ధమైన శ్రావణమాసము మంచిదని యూహించి, పెండ్లియైన పిమ్మట వచ్చే ప్రథమ శ్రావణమాసంలో పెండ్లికూతురిని అత్తవారింటికి తీసుకపోవడం ఆచారముగ జరిగింది కొన్నాళ్ళు. తరువాత రాను, రాను, నాగరికత విస్తరించి విచక్షణ జ్ఞాన శూన్యులైన కొందరికి పూర్వాచారం మోటైపోవడంచేత, పిల్లను అత్తవారింటికి కొనిపోవడానికి మారుగా పెండ్లికొడుకుగారింటి నుండి పెండ్లికూతురుగారింటికి నోమునోచుకోడానికి శ్రావణపట్టీ పంపించడం ఆచారమైంది.

ప్రభావతి:—అదా కథ? ఆ పట్టీలో యేమేముంటాయి?

సుశీల:— పోయిచూడరాదూ? లేచిరా? తలంటి నీళ్లు పోస్తాను, నోచుకొందుగాని.

ప్రభావతి కాంతులొలికే అధర బింబంమీద చిరునవ్వు ప్రకటిస్తూ లేచి మందుహాలోకేగి, అచ్చటనున్న శ్రావణపట్టీకి సంబంధించిన సాంబారాలన్ని జూచి మఱియొక తబుకులోనున్న సన్నకాగితపు పొట్లాన్నిదీసి, ఆత్రింతో అందులో యేముందోనని పొట్లము విప్పిచూచింది. విలువగల చిలుకపట్టుచీరె తనకోమల హస్తాలతో, వికసించిన ముఖారవిందముపై చెంలాటలాడుచున్న నల్లత్రాచు పిల్లలవంటి ముంగురులను సవరించుకొని చీరమడతదీసి పొరలసందున పెట్టబడిన కాగితపు ముక్కను దీసి చదువుకొన్నది.

“ ప్రియమైన ప్రభావతికి—

ప్రేమ లాంఛనముగా సమర్పించినది.

ఇట్లు, ప్రేమపాత్రుడు

విపులానందమూర్తి”

ఆశ్చర్యం ఒకవంక సిగ్గొకవంక వచ్చి అరికట్టినయి, ప్రభావతి ఆనందాన్ని “ఇదేమిటి నాపేరువ్రాశారు?” అనుకొన్నదాపిల్ల తనలో, ఇదోవిధంగా బాగానేవుందనుకొన్నది మళ్ళీ. ఇంతలో సుశీలవచ్చి “నీమొగుడు పంపేడుకో అబ్బ

రంగా! అస్తమానం చీరెఝాచుకొంటూ కూర్చుంటావా? కావలసినంత పనివుంది, లేచిరా?" అన్నది.

ప్రభావతికి పదమూడో సంవత్సరం జరుగుచున్నప్పటికీ, చురుకైన పిల్లగావడంవల్ల నాలుగోఫారం వరకు చదివింది. పెద్దపిల్లగదాఅని అనుమానిస్తూ, తల్లిదండ్రులు చదువుమానిపించేరు. లోకవ్యవహారాలు తెలుసుకొనడానికి యిప్పుడిప్పుడే కళ్లుతెరుస్తున్నది ప్రభావతి. తండ్రి "గృహలక్ష్మీ" మున్నగు మాసపత్రికలు, నవలలు, నాటకాలు తెప్పించియిస్తూంటె విసుగులేకుండా చదువుతుండేది. ఒక్కతే పిల్లగావటంవల్ల తల్లిదండ్రులు గారాబంగా పెంచుతుంటే సుకుమారంగా పెరుగుతున్నది. మూడుపాళ్ళు పసుపు రెండుపాళ్ళు నింకుగులాబి కలిపితేవచ్చే అందమైన రంగుతో చంద్రబింబమువంటి ముఖముగల్గి పట్టుకుచ్చులవలె నిగనిగలాడుతు పిరుదులవరకు వేల్రాడే కురులుగల్గి, సర్వాంగసుందరియై, సౌందర్యానికి వన్నెలుచ్చేవిద్య, విద్యకు మెరుగులుపెట్టే వినయముగల్గి విరాజిల్లుతూంది ప్రభావతి.

స్త్రీలకఖండపుణ్యప్రదమైన శ్రావణమాసము ప్రభావతి యింట్లోనే అవతరించిందా అన్నట్లు, వస్తూపోతూవుండే ముత్తయిదువులకు విసుగువిరామము లేకుండా కలకలలాడుతు పెండ్లివారి యిల్లుమాదిరిగా మంగళవాద్యములతో,

భామినీజనము వేడుకపాటలతో గడచిపోయింది. "మృగము నకు పెద్దపులియెంతో మేకమునంతే" అన్నట్లు శోభాయమానమగు శ్రావణమాసాన్నిగూడా కాలప్రవాహం కొట్టుకొని పోయింది క్రమక్రమంగా వారాలు పక్షాలు గతించి మాసాలు నడుస్తున్నయి. కార్తీకమాసం ప్రవేశించింది. శుభకార్యం కాస్తాముగించి పిల్లను మాయింటికి పంపిస్తే బాగుంటుంది అని అత్తవారు వార్తబంపేరు ఆవార్తవిని ప్రభావతి ముసిముసినవ్వులు నవ్వడంజూచి తల్లిదండ్రులుగూడా "సరే" నన్నారు ఒక సుభముహూర్తాన నలుగురు చుట్టాలు చేరి ఆకాస్తాయుక్కా చెల్లించి పిల్లను అత్తవారింటికి బంపించేరు. జరుగవలసిన మర్యాదలన్నీ, యింటిఆచారాన్ని అనుసరించి యథావిధిగా జరిపేరు. ప్రభావతి అత్తగారింట కాపురంజేస్తున్నది. తన కనుసన్నల మెలగుచూ, వినయ విధేయతలతో ప్రవర్తించుచుండుటచేత అత్తగారు ప్రభావతిని దయగాజూస్తున్నది. విమలానందమూర్తి భార్యనులాలించి, ప్రేమించి, ఆదరిస్తూ ఆనందవార్ధి నోలలాడిస్తున్నాడు బాలదంపతుల ప్రథమానురాగ సుఖసంపదలను, భావాలను మెవరు వర్ణించగలరు? సుగుణవతియు సౌందర్యవతియునగు ప్రభావతి తనకు భార్యగావడం తనపూర్వజన్మ సుకృతమే ననుకొన్నాడు. "నీకన్న అమూల్యమగు వస్తువీప్రపంచమున

లేదనియు నాసర్వస్వము నీవేననియు, నీవులేకున్న లోకమే శూన్యమనియు" అన్నాడు భార్యతో. పరిణయ పాశబద్ధుల యిన ప్రభావతీ విమలానందులు అనిర్వచనీయానంద మను భవిస్తూ ఆరుమాసాలు గడిపేరు.

మగడు ఖద్దరంటే అభిమానంజూపిస్తూ శుద్ధస్వదేసి వస్త్రాలనే ధరించుచుండడంచేత తానుగూడా ముతకబట్ట లను గట్టుట కలవాటు పడుటయేగాక, ప్రభావతి స్వయం గా రాటముమీద నూలుదీయుటకు ప్రారంభించింది. యుక్తా యుక్తము లెరిగిన చదువుకొన్న పిల్లగావడంచేత, ప్రభా వతికి పూర్తిగా దేశాభిమానం యేర్పడ్డది. దేశసేవచేయుట యందు పురుషుల కెంత బాధ్యతకలదో స్త్రీలకుకూడా అంత బాధ్యత అంత జవాబుదారీ కలదని గ్రహించింది. ఇట్లా కొన్నాళ్ళు జరుగుచుండగా ఒకనాడు ప్రభావతి తండ్రివచ్చి పిల్లను పుట్టింటికి పంపవలసినదని వియ్యంకుని అడిగి త్వర లోనే మళ్ళీ పంపిస్తానని అల్లుణ్ణి బ్రతిమాలుకొన్నాడు. మొ దటకాదన్నా తర్వాత దీర్ఘంగా ఆలోచించి "సరే" నన్నా డు విమలానందుని తండ్రి. భర్తను విడచియుండుటకు యి ష్టంలేకపోయినా బాల్యస్నేహితురాండ్రను, తల్లిని చూడ వచ్చునని యాశతో "పంపించండి" అని ప్రార్థించింది ప్రభా వతి. తుట్టతుద కందరు యిష్టపడ్డారు. మంచిరోజు జూచి

ప్రభావతిని ప్రయాణంజేశారు. "మీరు త్వరలో మావూరు రండి నాలుగురోజులుండి రావచ్చు" అని భర్తను వేడుకొని తండ్రివెంట స్వగ్రామం వెళ్ళింది ప్రభావతి. విమలానందునికి మొదటి నాలుగురోజులు కాస్త పిచ్చిపిచ్చిగా వున్నా, తర్వాత తర్వాత పనిపాటులు చేసుకొంటూ మామూలుగానే తిరుగుతున్నాడు. అప్పట్లో జరుగుచున్న సత్యాగ్రహోద్యమమునందు తానుగూడ శ్రద్ధతో పనిజేస్తూ గ్రామంలో జరుగుతున్న సభలకు హాజరవుతుండేవాడు.

ఉత్తమగ్రంథాలు చదవడమూ, రాటము ద్రిప్పడము ఈడువారలతో సరససల్లాపాలు ఆడుకోవడమూ మున్నగు పనులతో హాయిగా కాలక్షేపంజేస్తున్నది, ప్రభావతి పుట్టింట. నిత్యము రాటానికి పూజజేసి వీలగునప్పుడెల్లా జాతీయ గీతాల బాడుతూ దారముదీస్తుండేది. లక్ష్మీదేవివలె రాటముముందు గూర్చొని మనోహరంగా గీతాలు బాడుతూన్నప్పుడు కళ్ళపండువుగాజూచి యానందిస్తుండేవాళ్ళు-తల్లిదండ్రులు.- ఒకనాడు మామూలుప్రకారం ప్రభావతి మహోల్లాసములో మునిగి వుండగా తండ్రి దీనవదనంతో వచ్చి యేదియో చెప్పబోయి చెప్పలేక ఒకజాబును ప్రభావతికిచ్చాడు. తన మామగారియొద్దనుండి వచ్చినదని గ్రహించి ఆమె ఉత్సాహంతో జాబు చదువుకొన్నది. యెంతఉత్సా

హంతో చదవడానికి ప్రారంభించిందో అంత నిరుత్సాహం తో పూర్తిజేసింది. "సహాయ నిరాకరణ వాదియగుటచే విమలానందుని యధికార వర్గమువారు రెండుసంవత్సరాలు కఠినశిక్ష విధించి రాజమండ్రి జైలులో వుంచేరు" అని ఆజా బులో వున్నది మఱుక్షణము యింటి ముంజూరునుండి రాలు వర్షబిందువులమాడ్కి ప్రభావతికి కన్నీరు జలజలగారింది. తననుజూచి తండ్రిగూడా చింతిస్తాడేమోనని తనలోతాను పొరలి పొర్లి వచ్చుదుఃఖాన్ని మింగుకొని "నాన్నా! నేడెంతసుదినం?" అన్నది. గద్గదస్వరముతో తండ్రి "సుది నమా అలా అంటున్నావేమిటమ్మా?" అన్నాడు.

"కాదామరి? లోకకళ్యాణముకొరకు నాభర్త నిర్బం ధింపబడ్డాడు. యిదిశుభవార్తగాదా?"

"నిజమేగాని... నాకు మనస్సు నిలువకుంలేదు. జైలు లో అనేకకష్టాలున్నాయి నీచాతినీచమైన పనులు".

నాన్నా! ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలు, స్త్రీలు, వృద్ధులు సైతము దేశంకొరకు కారాగృహాలకు వెళ్ళుచుండ యుక్తవయస్కుడు, విద్యాధికుడునగు మీ యల్లునికొరకింత దిగులెందుకు? వారివిషయము నాకు సంతోషమే. కాని దేశ సేవజేయు భాగ్యం నాకుకూడ లభించలేదుగదా యని విచారిస్తున్నాను."

ఇట్లు అంటూ ప్రభావతి లేచి పడక గదిలోకి వెళ్ళి శయనించింది. ఇప్పుడామె మనస్సులో పెద్ద తుపానొకటి పట్టుకొన్నది. ఏమిచేయవలెనో తోచడంలేదు. జైలులో యెన్నికష్టాలు పడుతున్నాడో భర్త అని దుఃఖించి తానే తెలివిదెచ్చుకొని నేనుగూడా దేశసేవ జేయకూడదా అనుకొన్నది. ఛీ, అధమమగు ఆడుజాతిలో పుట్టినేమో అని అనుకొన్నది. ఏమేమో తర్క వితర్కాలు జరుగుతున్నాయి. "స్త్రీజాతిని దూషిస్తున్నానేమిటి? లోకాన్ని ముంచడానికి గాని తేల్చడానికిగాని స్త్రీజాతికే సమర్థతవుంది. తన శక్తికి యెదురుశక్తిలేకుండా రాజ్యాలు యేలిన విక్టోరియారాణి ఆడుదికాదా? ఘోరరాక్షసుడైన నరకాసురుణ్ణి చంపడానికి తోడుపడ్డ సత్యాదేవి ఆడుదికాదా? హరిశ్చంద్రునికి అఖండ యశము నార్జించి పెట్టిన చంద్రమతి ఆడుదికాదా? ముల్లోకాలను గడగడలాడించే యమధర్మరాజును సైతము ధిక్కరించి భర్తను సంపాదించుకొన్న సావిత్రి ఆడుదికాదా? ఇంతెందుకు? నేటి శాంతియుద్ధాన పాలుగొంటున్న వారిలో అధిక సంఖ్యాకులు వనితలేగదా? నేనుమాత్రమెందుకు నడుముకట్టగూడదు? శక్తిసామర్థ్యాలు తెలివితేటలుచాలకనా?... కాదు, కాదు... జైలులోవున్న నా నాథుని విజయధ్వజముతో విడిపించే మార్గముచూస్తాను. నేను నిజంగా పతివ్రత

నైతే, నాభర్తకు జయభేరి మోగిస్తాను...ఇప్పుడు నే నేం చెయ్యాలి? నాభర్తను దర్శించిరావడం నా ప్రథమ కర్తవ్యము." అని యేమేమో ఆలోచిస్తూ ప్రభావతి "నాన్నా!" అని కేక వేసింది తండ్రి వచ్చేడు. "నాన్నా"! రాజమండ్రి జైలుకు వెళ్ళి నీ అల్లుణ్ణి చూచిరావాలి, ఈ రాత్రికే ప్రయాణము, సిద్ధంగావుండు" అని అన్నది. తండ్రి తలయూపుతూ సంతోషంతో వెళ్ళేడు. ప్రభావతి భర్తకొకహారము సమర్పించాలెననుకొన్నది. వెంటనే లేచి పూలతోటలోనికి వెళ్ళి తన కంటికింపైన పూలను గోసుకొనివచ్చి ఓపికతో గూర్చొని శ్రద్ధతో సుందరమైన హారాన్ని తయారుజేసుకొన్నది. ఖద్దరువస్త్రముతడిపి వాడిపోకుండా హారానికిచుట్టి జాగ్రత్తగాదాచింది. భర్తకొరకు ఫలహారాలు యింకా కావలసిన అద్దము దువ్వెన, సబ్బు మున్నగు చిల్లరవస్తువులు సిద్ధంచేసుకొని ప్రయాణమై తండ్రితోగూడా 8 ఘంటల రైలులో రాజమండ్రి వెళ్ళింది.

ప్రభావతి ప్రాతఃకాలాన నిద్దరలేచి తలార స్నానము జేసి యిష్టదేవతలనుగొల్చి రాటానికి పూజజేస్తుంది. చెప్పిన నోములన్నినోస్తూ, పలికిన వ్రతాలన్ని శ్రద్ధతో పడుతువుంది. ఒంటిపూటభుజిస్తూ కటిక నేలమీద శయనించడం వల్ల మనిషి కాంతి తలిగినా సహజంగా సౌందర్యవతిగావడం

చేత అంద చందాలేమి తగ్గలేదు. పూర్వంవలె తల్లిదండ్రుల తో చనువుగా మాట్లాడడంగాని చెలికత్తెలతో యిష్టాగోష్టి చేయడంగానిలేదు. రాత్రింబవళ్ళు భగవదారాధనదప్ప యితర చింతలేకుండా మంచిరోజులకై నిరీక్షిస్తూ వున్నది. నిశ్చయంగా భగవంతుడనే వాడొకడువుంటే ఆభగవంతు డికి భక్తులను పాలించడమే ధర్మమైతే యింతదీక్షతో, యిం తశ్రద్ధతో యింతభక్తితో పూజిస్తున్న ప్రభావతి మొర ఆలకింపడా ?

కాలచక్రం శరవేగాన్నిమించి పరుగెత్తుతూంది. క్ర మ క్రమంగా మళ్లీ శ్రావణమాసమొచ్చింది. క్రిందటిశ్రావణ మాసంలో అత్తవారు బంపిన శ్రావణపట్టీ విమలానందుడు బంపినచీరె తలపుకువచ్చి దుఃఖించింది ప్రభావతి. ఈయేడు మాత్రం యెందుకు ఉల్లాసంగా శ్రావణమాసంగడపగూడదు అనుకొన్నది. కృష్ణాష్టమి వ్రతము, గరుడపంచమి వ్రతము, వరలక్ష్మివ్రతము శ్రద్ధతోను భక్తితోను వరుసగాజరుపుదా మనుకొంది. స్త్రీలకు పుత్రపౌత్రాది సర్వసంపదల నొసంగి కామితార్థములచేకూర్చు ప్రభావము గలదిగదా వరలక్ష్మి వ్రతము అని యూహించుకొన్నది. శుభదినము సమీపించ గానే, అనగా పూర్ణిమకు ముందు శుక్రవారమునాడు ఉద యాన లేచి స్నానంజేసి మడిబట్టలుగట్టుకొన్నది. శుభమైన

ప్రదేశాన్ని గోమయంతో అలికి మంటపముజేసి ఆసనముయే ర్పాటుజేసి దానిమీద క్రొత్తబియ్యంబోసి మఱ్ఱిచిగుళ్లుమొదలగుపంచపల్లవంబుల కలశంబేర్పరచి వరలక్ష్మీదేవిని ఆవాహనజేసింది. పురోహితుడిసహాయంతో సక్రమంగాపూజలు జేసి తర్వాత పండ్రెండుకుడుములవాయనదానాలు, దక్షిణ తాంబూలాదులొసంగి, బ్రాహ్మణోత్తములకు నమస్కారాలుజేసింది. బ్రాహ్మలంతా ఆశీర్వదించేరు. ప్రభావతి మహానందంబొందింది. ఎప్పటికైన వరలక్ష్మీదేవియే తన్నుద్ధరించునని తనభర్తకు జయముగలిగించునని నమ్ముకొన్నది. శ్రావణమాసమంతా వ్రతాలతోను బ్రాహ్మణసంతర్పణలతోను గడచిపోయింది.

దేవపూజలతో కొన్నాళ్లు, నోములతో కొన్నాళ్లు జరిగినయి. ఎన్నాళ్లుజరిగితే రెండేండ్లు పూర్తిఅవుతాయి? రెండేండ్లకుగదా విమలానందునికి కారాగృహవిముక్తిగలిగేది? ఈ విధంగానే సంతోషంగా మఱికొన్నినెలలు నెట్టింది ప్రభావతి. ఒకనాడు ప్రభావతి యెందుకో తనపెట్టె తీయుగా అందులో తనభర్త ప్రేమలాంఛనంగాసమర్పించిన చిలకపట్టుచీరెకంటబడ్డది. వెంటనే ఒకదానివెనుక నొకటిగా సినిమాబొమ్మలవలె తానుభర్తతో అనుభవించినసుఖాలన్ని కట్టెదుట సాక్షాత్కరించినయి. ప్రభావతి కాచిలుకపట్టుచీరె కట్టుకుందా

మని బుద్ధిపుట్టింది. చీరె యివతలికి దీసి పెట్టె బీగం వేసింది. లేచివచ్చి రేగినతలను సవరించుకొని పరిశుభ్రంగా స్నానం జేసి, శుభసూచకమైన తిలకాన్ని దిద్దుకొని చిలుకపట్టుచీరె ధరించి నిలువుటద్దంలో తనఅందాన్ని జూచి ఆనందించింది. ఇప్పుడు తనభర్త వెంటవుంటే... అనియేమేమోఅనుకొన్నది. ఇంతలో తండ్రి కేక వినబడ్డది. వస్తున్నానంటూ జనకునియొద్దకు వెళ్ళింది.

ఊరంతా దీపాలుబెట్టేరు. ప్రభావతి వీణవాయిస్తు కూర్చొన్నది. కొంతసేపైన తర్వాత "ఇవ్వాళ నాకీయలంకారాలన్ని యెందుకు? ఎవరుజూచి సంతోషించను?" అని అనుకొన్నది. "ఎందుకోలే, నాపిచ్చి నాకానందం" అని తనలోలోను చెప్పుకొన్నది. తండ్రి భోజనానికి రమ్మనమని పిలిచేడు. వీధివాకిలి తలుపు గడివేసి వెళ్ళింది. తండ్రికంటె ముందుభుజించి లేచివచ్చి కుర్చీలో గూర్చొని ఆకాశపంచాంగం గుణిస్తువున్నది. తల్లివడ్డిస్తుంటె తండ్రియింకా భోంచేస్తున్నాడు వీధిలో యెవరో తలుపు తట్టుతున్నారు. "ఎవరువారు?" అన్నది ప్రభావతి. జవాబులేదు. ప్రభావతి లేచి తలుపునొద్దకేగి గడిదీసింది. ఎవరికోసం నోములునోస్తున్నదో ఎవరికోసం యీ ప్రయత్నం అంతా చేస్తున్నదో

ఎవరికోసం ఉపవాసాలుజేసి శుష్కించిపోయిందో ఆ విమలానందమూర్తి ప్రత్యక్షమైనాడు ఇంకేంకావాలె? ఇరువురు ఒకరినొకరు చూచుకొన్నారు. ఇద్దరికి నోటమాట రాలేదు. కొంతసేపటికి "ప్రభా!" అన్నాడు భర్త. "రెండేండ్లుకాలేదు గద, అప్పుడే యెలావచ్చేరు?" అన్నది అప్రయత్నంగా ప్రభావతి.

"రాజప్రతినిధి మహాత్మునితో రాజీచేసుకొన్నాడు. మొన్నటి లవణ సత్యాగ్రహులతోబాటు మావంటి పాత రాజకీయ ఖైదీలనుగూడ కొందరిని విడిపించేడు. జయము మాదే."

"ఇదంతా నా వ్రతప్రభావమే" అన్నది సగర్వంగా ప్రభావతి.

---

# ప్రాయశ్చిత్తము

"పరులధనమునకు-విద్యా
పరిణతికిన్_దేజమునకు-బలమునకు మనం
బెరియగ నసహ్య పడున
న్నరుడు తెవులులేని వేదనం బడునధిపా!"

[భారతము]

మాణిక్యరావు నానా అగచాట్లుబడి, యెలాగైతేనేమి స్కూలుఫైనలు పరీక్షకు వెళ్ళివచ్చాడు. స్కూలుఫైనలు పరీక్ష సరిగా అయిందో, లేదో, అతనికి మహేంద్రపదవి లభించినట్లుంది. లోకములో తనకంటె తెలివితేటలు గల వాడు లేడని గర్వపడ్డాడు. ప్రతిమనిషికి గర్వంవుండడము, న్యాయమేగాని దానికి హద్దువున్నది. ఆత్మగౌరవము కాపాడుకోవడమునకు చాలినంతెగర్వము వుండవచ్చును. గాని, ఆగర్వము ఇతరులకు అపకారము చేసేదిగా వుండగూడదు. మన మాణిక్యరావు గర్వము, అతన్ని దిగమ్రింగేదేగాని, అతనికి ఉపకారము చేసేదిగాదు. మాణిక్యరావునకు చాలా పెద్దపెద్దకోరికలుదయించినయి. సురేంద్రనాథ బెనర్జీయంత గావాలెనని ఆలోచన గలిగింది. ఎలాకావడం? అతనికున్న స్వల్పచదువులో, అంత పెద్దవాడేలాగవుతాడు? దివారా

తాగ్రిలు అతనికిదే ఆలోచన. "నేను చాలా బీదవాణ్ణిగదా, యెక్కడో చాకిరిచేసుకొని నాలుగు డబ్బులు సంపాదించుకొనకపోతే యేలాబ్రతుకుతాము" అనే ఆలోచన అతనికి తట్టలేదు.

మాణిక్యరావు, నివసిస్తున్న జగన్నాథపురములోనే, మాధవరావుగూడా వున్నాడు. మాణిక్యరావునకు యితడు సమీప బంధువేకూడాను. అతనికంటె యితను తెలివిగలవాడు. ఒక క్లాసు తొమ్మిది సంవత్సరాలు తప్పిపోయినాడు. మరెవరైనా అయితే, పుస్తకాలు గంగలో వాసేసి, "చాలురా బాబు చదువు" అని సన్యాసత్వం పుచ్చుకొనేవాళ్ళు. పాపం! ఓపికతో మళ్ళీచదివి ఫస్టుఫారంకూడా పరీక్షకు వెళ్ళి తప్పిపోయినాడు. వీడు దుర్మార్గుడని తెలిసియే కాబోలు, భగవంతుడుగూడా, దయతలచలేదు. భార్య కాపరానికి వచ్చి ఏడారు సంవత్సరాలు కావొచ్చింది. మాధవరావునకు, యిప్పటికి యొరగాని యేగాని సంపాదించుటకు చేతగాదు. ఈస్థితిలో అతను గర్వపడవలెనా? సిగ్గుపడవలెనా? లోకము తన్నుగురించి యేమనుకుంటున్నదో, అని విచారించుచుండా తిరిగితేసరా?

మాణిక్యరావు మాధవరావులకు, మిక్కిలి స్నేహం ఇద్దరి భావాలు ఒకటే సహజంగా యేరకానికి ఆరకం చేరుతుంటుంది. లోకములో, చెడిపోయినా, బాగుపడ్డా ఒకరి

కొరకరు తీసిపోకుండా నరిసమానంగా వుంటారు—"గొప్పవాళ్ల మధ్యే విధమేలాగా?" అని యిద్దరికి ఆలోచన... కొన్నాళ్ళు దీర్ఘంగా ఆలోచించగా, మాధవరావుకు ఒక వుపాయం దొరికింది. పెద్దవాళ్ళను కొంతమందిని విమర్శిస్తే, తాము గొప్పవాళ్ళ మవుతామనుకొన్నాడు. తమ పేర్లు గూడా నాలుగుతడవల పేపర్లో అచ్చుబడతయి అని, అది చూచి ప్రజలంతా వారిని గొప్పవారనుకొంటారని అనుకున్నాడు...పూర్వం ఒక కథజెప్పేడు మా తాత..."ఒక పెద్దమనిషి, తన స్నేహితునితో 'నేనురాజుగారితో ఇవ్వాళ మాట్లాడివచ్చానన్నాడట. ఏ విషయము మాట్లాడివచ్చా' వని ఆ స్నేహితుడు ప్రశ్నింపగా, రాజుగారు వస్తుంటే, దారిలో అడ్డంగా నిలువబడ్డాను, అంత రాజుగారు నన్ను జూచి 'ఛీ! దుర్మార్గుడా దూరంగానెళ్ళు' అన్నాడు, అని బదులు చెప్పాడట"... ఆవిధంగా వున్నయి మన మాధవరావు తెలివితేటలు.

తమకు బాగుపడే యోగం లేకపోయినందుకు, యేడువకుండా, యితరులు చక్కగానుంటే, చూచి యోర్చలేరు. మన మాణిక్యరావు మాధవరావులు. మాధవరావు సలహా విన్నాడు మాణిక్యరావు. పెద్దవాళ్ళను విమర్శించడానికి పూనుకొన్నారు యిద్దరు. పాపము! విమర్శించడమంటే మా

టలతో వుంది, అనుకున్నారు యిద్దరు. ప్రఖ్యాతి వహించిన ఒక కవిపుంగవుడు వ్రాసిన గ్రంథాలమీద విమర్శనలు వ్రాసి పత్రికలకు బంపారు. ఆమరునాడు పత్రికలో మాణిక్యరావు పేరుతో విమర్శనము ప్రచురింపబడివుంది. ఆంధ్రలోకమంతా చూచింది. ఈ అవకతవక వ్రాతలు, అర్థములేని అబద్ధపు వ్రాతలుజూచి, ఆంధ్రులు సహించలేక పోయినారు. సుప్రసిద్ధ కవికుమారులు వ్రాసిన, గ్రంథాలకు లేని నిందను ఆరోపిస్తే, ఆంధ్రులు సహించలేకపోయినారు. నాలుగు మూలలనుంచి తెలుగువారు సమాధానాలు వ్రాసి పత్రికలకు బంపారు. మరునటిదినము పత్రికలో, "మాణిక్యరావుకు బుద్ధిలేదా?" అని యొకరు వ్యాసమును వ్రాశారు. ఇదంతా మాణిక్యరావు చదువుకొన్నాడు. "మాణిక్యం! నీకు తగిన ప్రాయశ్చిత్తముము అయినదిగదా?" అని స్నేహితులంతా అన్నారు. గాని, మాణిక్యం తిట్లుతినుట మానలేదు. ఇంకా విమర్శనలు వ్రాస్తునే యున్నాడు. తానుగొప్పవాడైందాకా, అలాగే వ్రాస్తుంటాడేమో!

ఒకనాడు సాయంకాలము ఒక కవిశేఖరుడు సభలో ఉపన్యసిస్తున్నాడు. ఆసభలో మాధవరావుకూడా వున్నాడు. ప్రజలందరు తనను ఫలానా, అని తెలిసికొనవలెనని అతని

కోరిక. వెంటనే లేచి. మాధవరావు ఉపన్యాసమును విమర్శించుటకు ప్రారంభించాడు. అంతట సభలోనుండి, "నోరుముయి, కూచో" అను కేకలు బయలుదేరినయి. కొందరు మాధవరావుమీద రాళ్ళురువ్వారు. ఇంతలో అగ్రాసనాధిపతి లేచి, "మాధవరావుగారూ! ఇక్కడ వుంటే తమకు దెబ్బలు తగులుతవేమో, అవతలికి దయచేయండి" అని సాగనంపాడు, మాధవరావుకు తగిన ప్రాయశ్చిత్తము జరిగింది.

ఈ విధంగా మిత్రులిద్దరికీ తగిన ప్రాయశ్చిత్తము అప్పుడప్పుడు జరుగుచున్నది. వారి బుద్ధి మారేవరకు యీలాగే జరుగుతుంటుందేమో?

---

# గిరీశంగారి దౌర్జన్యము

* * *

గిరీశం:—హల్లో! శాస్త్రులుగారూ! దయచేయండి! యెందాకా, బయల్దేరారు?

శాస్త్రిలు:— ఇక్కడికేనండి! సోమయాజులుగారింటికి పోయివద్దామని.

గిరీశం:—చిత్తం, దయచేయండి! మిమ్ములను చాలా రోజులనుంచి అడగాలనుకుంటే తెటస్పించుట లేదు. సరేగాని, మాబోటి శాపింగు పెట్టిన వాళ్లందరిని తిట్టారుగదా మీరు మొన్నటిదాక, యిప్పుడు మీకొడుకు శాపింగు పెడితే మాట్లాడరేమండీ?

శాస్త్రి:—మాట్లాడకపోవడమేమిటి? యింట్లోనుంచి వెళ్ళగొట్టాను కూడాను.

గిరీ:—అయితే యిప్పుడు మీయింట్లోనే వున్నాడే?

శాస్త్రి:—మళ్ళీ తీసుకొచ్చానండీ! మాయింట్లోది ఏడుస్తూంటే. కన్నకడుపుగదూ?

గిరీ:—చిత్తం అందరివిషయము అంతేగదండీ మరి?

శాస్త్రి:—ఏదోలెండి! జరిగిపోయినదానికెందుకు? వస్తా కొంచెం వెళ్ళాలి.

గిరీ:—అరే! కూచోవయ్యా! పోదుగాని...

శాస్త్రి:—యేమండీ! మర్యాదలేకుండా మాట్లాడుతారు? మీదంతా కొంటెవ్యవహారముగా నున్నదే!

గిరీ:—బయటికి కన్పడు కొంటెతనం నాది! కనపడకుండా కొంపతీసే కొంటెతనం మీది యింతే భేదం.

శాస్త్రి:—నేనెవరికొంప తీయ లేదు. తెలియకుండా మాట్లాడకండీ!

గిరీ:—తెలిసేమాట్లాడుతున్నా. వస్తామని పేరుబెట్టి చందాలు వసూలు చేసి డాబా కట్టించారు గాద్షా!

శాస్త్రి:—అబ్బే! అదికాదండీ! నాకు సరిపడనివాళ్లు యీగోల పెట్టారు. చందాలు అట్టే వసూలుకాలేదండీ!

గిరీశం:— అయితే డాబా మీతాతగారు కట్టించి యిచ్చేరాండి?

శాస్త్రి:—ఏమిటండీ! వంగినకొద్దీ మొదుతున్నారు? మీపంతుళ్లుచేసేది బాగుందేం? మొన్న శోకనాథం పంతులు మ్యునిసిపల్ వైస్ఛైర్మనుగావుండి అమాంతం ఇరవైఅయిదు రూపాయిలు మ్యునిసిపల్ సొమ్ములోనుంచి సొంతసొమ్ములాగా దిగమింగాడట! దీనికేంచెప్తారు సమాధానం?

గిరీశం:—డామిట్! యెవడో వెధవ చేశాడని అందర్ని అంటావేం?

శాస్త్రి:— లోపాలు అందరిలోనూ వున్నవి కాబట్టి మమ్మల్ని తిట్టబోకండి! నన్ను పోనివ్వండి త్వరగా వెళ్ళాలి.

గిరీశం:— నామాట వినిపోండి! ఒక పెళ్ళి చేయించాలి. లాభదాయకమైన బేరం, వస్తావా?

శాస్త్రి:— వెధవముండ పెళ్ళేనా ?

గిరీ:— డామిట్! పిచ్చిపిచ్చి మాటలు మాట్లాడబోకు, వెధవముండని దాని మొహాన వ్రాసివుందా ?

శాస్త్రి:— కాదులెండి ! అంత ఆగ్రహమైతే యెలాగు? ఊరం కేలఅడిగాను. బాలవితంతువా ?

గిరీశం:— నీకవన్నీ అనవసరము. నీ సంభావనంగతి చూచుకో. అందరికంటే ఓపావలా యెక్కువగా ఇప్పిస్తాను.

శాస్త్రి:— చిత్తం. అలాగేలెండి ! మీామాట కాదురాడితే బ్రతుకనిస్తారా?

గిరీశం:— ఆ? అలా అను! తెలుసుగా మనసంగతి?

(గట్టిగామాట్లాడితే తన్నేటట్లున్నాడురా బాబూ!అని అనుకుంటూ శాస్త్రి నడచుచు రోడ్డెక్కెను.)

—————

# రాధ ప్రకృతి.

అనురాగమంకురించి, పెరిగి, పెద్దదై, ప్రేమగా మారుతుంది. ప్రతిఫలాపేక్షతో గూడినది రాగము-నిష్ఫలాపేక్షతోనుండి, నిష్కళంకమైనది ప్రేమ. ప్రేమలో ఇహపరము లిమిడియున్నవి. ఐహిక ప్రేమ ఆముష్మిక ప్రేమకు మూలవేరు - పవిత్రహృదయులీ మెట్లన్నీ యెక్కగలుగుతారు. సామాన్యులెక్కడో పడిపోతారు.

గోకులంలోనున్న బాలకృష్ణుని, రాధలాలించి పెంచి ముద్దుముచ్చటలలో పాల్గొని ఆనందించినది. శైశవంబోయి, కృష్ణమూర్తి యువకుడైనాడు. ఇతడు తెలివితేటలుగల పోకిరని నాజూకుగా, అల్లరిజేసే రసికుడని, రాధయభిప్రాయము. అప్పటికామెదృష్టిలో నతడు సామాన్యమానవుడే-యౌవ్వనంలోనున్న కృష్ణుని రూపవిభ్రమ విలాసాదులకు, లావణ్యానికి రాధ లొంగిపోయింది. మానవసహజమైన భోగాపేక్షతో రాధ హృదయముఱ్ఱూతలూగినది. కృష్ణుడు తన చెప్పుచేతల్లో నుండవలెననీ, యెక్కడికీ పోగూడదనీ, యెవరితోను మాట్లాడగూడదనీ శాసించుటకు ప్రయత్నించినది. ఆతడు పెట్టే తిప్పలన్నీపడి, చేసేఅల్లరంతా సహిం

చినది. ఎవరు ఏమన్నా అన్నా పెడచెవిని బెట్టింది. లోకనిందకు తలయొగ్గింది, తుదకు, కష్టాలకుతగిన ఫలితమనుభవించింది. కృష్ణుని సాయమున అంచితానంద డోలికలలో నూగుచు తన్నుదానుమరిచి పోయినది. రాధాకృష్ణులేకమైనారు.

క్రమ క్రమంగా రాధ హృదయ పీఠానికెక్కిన కృష్ణుడు స్థిరపడిపోయినాడు.

సంవత్సరాలు గడిచినవి. కృష్ణుడు మానవులకందని మాయలమారియైనాడు. రాధకతని చర్యలర్థము జేసికొనుట కష్టతరమైనది. గట్టిపట్టుదలతో ప్రయత్నించుటకు ప్రారంభించినది. నిరంతర మీచింతతో రాధ జీవితమునందొక నూతనధ్యాయము ప్రారంభమైనది. మొదటిరాధ గాది ప్పుడు-ఏకాగ్రచిత్తమున నున్న రాధకు నానాట ఆత్మశక్తి వృద్ధియగుచున్నది. కృష్ణుడు ప్రయత్నపూర్వకముగ దూర మగుచున్నాడు వియోగమువలన ప్రేమానురాగములు మరింత పెనవేసుకొనుచున్నవి. అతని నన్వేషించుటదప్ప, యామెకన్యచింత లేదు. వెతికి వెతికి వేసారిపోయినది. ఆవేదన మేడువుగా మారుచున్నది.

అది శారదరాత్రి:_ రాకాసుధాకరుడు ధవళకాంతులను వెదజల్లుచున్నాడు. మధురమైన ఆవెన్నెలరాత్రి యందపరిమితానంద మనుభవించి, తన్మయత్వము జెంది

నది గాంభీర్యము, యమున నిశ్శబ్దముగ శయనించియున్నది. గాలిబుడతడప్పుడే గాఢనిద్రాపరవశుడైనాడు. తరులతాదులకుగూడ నది విశ్రాంతి సమయమేమో? ఆకైనకదలుట లేదు.

నదీతీరాన, అతిభారముగ అడుగులువేయుచు, రాధ పిచ్చిదానివలె తిరుగుచున్నది. అది యేకాంతావాసమున కానందదాయకమగు తరుణమని యెవరంటారు? ఆమె అన్నిదిశలు పరికించి, తిరిగి, తిరిగి, వచ్చి నీళ్ళవంకచూచింది రెండడుగులు ముందుకువేసి, నదీజలమును, కన్నార్పకుండా చూస్తూ కూర్చున్నది-పరులకిది వెఱ్ఱితనంగా నుండవచ్చు రాధ పిచ్చిదని యితరులనుకొనుటలో ఆశ్చర్యంలేదు. గాని, ఆమె కితరుల విమర్శనలతో పనిలేదు. లోకము నామె పాటించదు.

రాధకానీళ్ళలో కృష్ణుడు కనుపించినాడు. అనుమానంతో గూడిన ఆతురతతో ఆమె అక్కడే చూస్తున్నది. వరుసగా నెమలిపింఛము - కౌస్తుభమణి - కస్తూరితిలకము-చిరుబొజ్జ-పీతాంబరాలు అన్ని గోచరించినవి-విశ్వమోహనమైన వేణువు చేతిలోనున్నది. ముద్దులు మూటగట్టే లేతబుగ్గలమీద చిరునవ్వులు సుళ్లుదిరుగుతున్నయి-ఆమనోజ్ఞాకారుని

వామపార్శ్వాన ఒక సుందరి కూర్చొనియున్నది. రాధ యిదంతా చూచినది. రోషంతోకూడిన కోపావేశాలు రాధ నావరించినవి-మరుక్షణంలో ఆమె మామూలుగా నున్నది. నిశ్చలమైన మనస్సుతో రాధ తీవ్రింగా, నదిలో చూస్తు న్నది. ఆమెకు నీటిలో గోచరమగుచున్న స్త్రీమూర్తి తనవ లెనే తోచినది. తలకట్టు తన దే-అవయవాల పొందిక తనదే ఆభరణాలు తనవే ఆ సన్నని లేతనడుము-బంగారు కుండల వంచించు కుచములు-అంతకంటె అందంగా అమరియున్న పిరుదులు- అన్నీ చూచింది. అంతా తానే, అవునో? కాదో? సందేహము.

రాధ తన్నుతాను నమ్మలేకుండానున్నది. అటు నిటు జూచింది. ఏమీ తోచక వేడినిట్టూర్పు విడిచి మళ్ళీ నీళ్ళ ల్లో చూచింది. తన్నుజూచి కృష్ణుడు పకపకా నవ్వాడు. రాధ కళ్ళుమూసుకొన్నది. ఆ దృశ్యాన్ని చూడలేకపో యింది. ఆమె హృదయంలో కారుచిచ్చు రేగింది. భరింప రాని ఆవేదన పొంగులు సాగింది. నోటమాటలేదు. ప్రక టించుటకు భాషచాలదేమో? తలవంచుకొన్నది. కళ్లవెంట కడవతో కుమ్మరించినట్లు, నీళ్ళుగారి, యమునలో గలుస్తు న్నాయి-ఎంతసేపేడ్చిందో గుండెకరిగేవరకు ఆమెకే తెలి యదు. కొంతకాలము గడిచింది.

వెనుకనుంచి తన రెండుకళ్ళను యెవరో మూసినట్లు రాధకు తోచింది. తన కరకమలములతో ఆ రెండుచేతులు పీకి, విడలించుకొని, తలద్రిప్పి జూచినది. మనోనాథుడు నవ్వుతూ ప్రత్యక్షమైనాడు. నీళ్లలోజూస్తే, అక్కడి రాధా కృష్ణులక్కడనే యున్నారు. నాలుగు మూలలు జూచింది-ఎటుజూచినా, రాధాకృష్ణులే—ఆ రాధ తన వెనుకనున్న కృష్ణుని రెండుపాదాలు పట్టుకొని, తన వేడి కన్నీటితో కడిగి, కళ్ళకద్దుకొన్నది. ఆ కన్నీరంత పరిశుద్ధమైనది గాబోలు, కృష్ణుడిపాదాలు వెన్నెలలో తళ తళ మెరుస్తు న్నాయి. అతిడామెను లేవదీసి, బాహువల్లరిలో జేర్చు కొన్నాడు. రాధాకృష్ణులేకమైనారు. అంతానిశ్శబ్దము-గాలి బుడుతడప్పుడే మేలుకొన్నాడు - యమునానది మెల్లగా, కదిలి, ప్రేమగీతాలు పాడుకొన్నది—

---

# ప్రేమాంజలి.

* * *

కుమారీ! పవిత్రభావ పూర్ణమగు లేనగవులు నీయమాయికవదనమున చిందులుద్రొక్కుచుండ, నిగనిగలాడు పట్టుకుచ్చులతో పిరుదులవరకు వ్రేలాడు నల్లత్రాచువంటి జడవేసుకొని, జరీబూటా నగిషీపనిజేసిన పట్టుపావడధరించి, ప్రాణములున్న పసిడిబొమ్మమాడ్కి సంచరించుచు, యీడువారలగూడి యచ్చనగాయలాడుచు, కాలగర్భమున మాటువడియున్న యాంధ్రయోధుల వీరగీతికల మనోహరముగ బాడుచు జననీజనకుల నోముల పంటవై—సజ్జనానంద సంధాయివై_నివసించు గ్రామమునకు-గృహమునకును వన్నెలుదెచ్చితివి. అభ్యంజనానంతరము తడియారని జాలుగా వదలిన కేశపాశము లెగురుచు గాలిలో విలాసముగ నాట్యము సలుపుచుండ-అప్రయత్న హాసోన్మత్తవై-కల్లకపటము లెఱుగని నిష్కల్మష హృదయముతో, వనమధ్యమున నొయ్యారముగ నుయ్యాలలూగుచు, కవితాకన్యయో—వనదేవతయో—యను భ్రాంతి గల్పించి, సృష్టికొక వింతయుందమును గూర్చితివి. సకాలమునకు సక్రమముగ జదువుకొనుచు, వీలగునపుడెల్ల గానకళ నభ్యసించుచు, మధ్యమధ్య యవకాశము ననుసరించి తల్లిదండ్రులకు చేదోడు

వాడోడుగనుండి, యోపికతో నింటిపనులను సవరించుచు కాలమును సద్వినియోగము జేసితివి. జననీజనకులలోగాని, బంధు మిత్రులలోగాని, ఒకరు రోగపీడితులై యున్నప్పుడు అనుభవ జ్ఞానశూన్యవగు నీవు నిద్రాహారములు మాని, విసుగుకొనక, రోగికి సేవజేయుచు, అసహ్యమనుమాట మఱచి, నిపుణమతివై ఉపచారములజేసి, నీ దయార్ద్రి హృదయమును జాటితివి. ఇట్టి నీశక్తిసామర్థ్యములను యథామతిని గుర్తెరుంగుట కష్టతరము. బాలా! జన్మమనగ నీదే జన్మము సౌభాగ్యవతీ! నీకాశీర్వచనములు.

ప్రేమస్వరూపిణీ! నిన్నత్యంత గారాబమున బెంచిన తల్లిదండ్రులను-దాసదాసీజనంబులను వీడి, యెచ్చట నుండి యో వచ్చిన భర్తయే దైవమని సంభావించి, కేవలము ధర్మమునకు కట్టుబడి, ఆ నీభర్త సన్మార్గుడో_దుర్మార్గుడో సరసుడో-విరసుడో-ఉత్తముడో-నీచుడో_గుర్తెఱింగి అతని హృదయాంతరాళమున బ్రవేశించి, ప్రణయబీజములనాటి, నీ యున్నతాశయములను, విశాల హృదయమును, సమయానుకూలముగ సర్దుకొని, భావముల నేకీభవింపజేసి, పాపభూయిష్టమగు నీపాడులోకమును స్వర్గతుల్యముజేసి, నీభర్తనానందవార్ధి నోలలాడించితివి ముట్టినమాత్రమున ముడుచుకొనిపోవు గులాబీకాంతులను వెదజల్లు శరీరచ్ఛాయగల్గి,

సర్వాంగ సౌందర్య సౌష్ఠవాభివృద్ధినొందిన, నవయౌవన దివ్యతేజముతో, సర్వప్రపంచము నాడించగల శక్తిగలదని చాటు వాల్గన్నుల వైఖరితో-బాలకురంగము భాతి గృహ మందిర ప్రాంగణముల యందు సంచరించుచు, చీకు చింతలను బారదోలి-కష్టపరంపరల నరికట్టి-కంటిఱెప్పలవలె గాపాడుచు, నాథుని స్వర్గసుఖముల దేల్చితివి. నోములని-వ్రతములని-పసుపు కుంకుమలని-పారాణియని, అతిథులని, అభ్యాగతులని, దానములని, ధర్మములని, పవిత్ర హృదయముతో భర్తను సన్మార్గమునకు ద్రిప్పి, గృహలక్ష్మివై సర్వసంపదల నొసంగుచు శారదవై విజ్ఞానవెల్లువను బ్రవహింపజేసితివి. నీ ప్రాణప్రియుడు పరవనితా ప్రణయపాశ బద్ధుడై అకృత్రిమ ప్రవర్తనుడై నీ నిష్కల్మష ప్రేమానుబంధమును త్రెంపివేసి, నిన్నగచాట్లపాలు జేయుచున్నప్పుడు సైతము, అసూయవహింపక, యీర్ష్యబోనాడి, కోపమును వీడి, దైవముపై భారముంచి, మంచిదినములకై నిరీక్షించుచు అత్యద్భుతమైన నీ పాతివ్రత్య మహిమను లోకమునకు జాటి, యిష్టఫలసిద్ధిని బొందితివి. నిశ్చయముగ నీవు శక్తిస్వరూపిణివి. జన్మమనగ నీదేజన్మము. ఓ మహిమాస్పదహృదయయగు స్త్రీమూర్తీ! నీకిదే ప్రణుతాంజలి.

తల్లీ! అమృతస్వరూపిణీ! మోపలేని భారము వహించి, నవమాసములు మోసి పుత్రోదయమయ్యెనని మహోల్లాసమున మైమఱచి, తృటిలో యానందమూర్తివై పోతివి. ఆపసికూనను- అశుభము శుభము దెలియని యర్భకుని, యాలింగనాభాగ్యము ననుభవించుచు, అష్టకష్టములకు లోబడి సాకుటకు ప్రారంభించినప్పటి నీయోర్పు-నీయాదరణ-నీ యనిర్వచనీయమైన ప్రేమ నీ శ్రమ-వర్ణింప నెవరితరము? ఇంతలాలించి పెంచి, పెద్దవానినిజేసి "తల్లి కన్న వేరుదైవములేదు" యనువాక్యమును సార్థకపరచి విద్యాబుద్ధులు గరపి, వివాహాది శుభకార్యముల నత్యంత శ్రద్ధతో జరిపి, సర్వకాల సర్వావస్థలయందును తనయుని యభివృద్ధి కాశపడుచు, అమూల్యములును ననివార్యములు నునగు యాశీర్వచనముల నొసంగితివి...గాని...ఆ నీతనయుడార్జనాపరుడై భార్యాలోలుడై-నిన్ననరాని మాటలని, గుక్కెడు గంజియైన బోయక, విరసించి నిష్టురోక్తులాడునప్పుడు సైతము, పల్లెత్తుమాటాడక, పుత్రశ్రేయోభిలాషవై, భగవంతుని బ్రార్థించుచు, నీవు వహించిన సహనభావమును- ఆనీపవిత్ర హృదయమును- ఆకరుణార్ద్రచిత్తమును- గ్రహింప నెవరికి సాధ్యము? జన్మమనగ నీదే జన్మము- నీవు జన్మించిన స్త్రీజాతియే జాతి. ఓ మాతృదేవీ! సాష్టాంగ ప్రణామంబులు.

శృంగార రసస్వరూపిణియగు మోక్షప్రదాయినీ! నీవు ప్రేమమయివి. నీ దేహమందలి ప్రతి రక్తనాళమునందును ప్రేమతరంగము లుప్పొంగుచుండును. జాలియే నీ ప్రేమకు ప్రథమసోపానము. ప్రతిఫలసూన్యముగ ప్రేమించుటయే నీ స్వభావము. నీ మహిమ నెఱింగి దేవాదిదేవులు సైతము నిన్నారాధించి మార్గదర్శకులైరి. నీజాతి పూజనీయమైనది. నీవులేనిలోకము చంద్రుడులేని చందము. పవిత్రమూర్తీ! ఆదిలక్ష్మీ! అనురాగ పూరిత హృదయుడనై భక్తి శ్రద్ధలతో నర్పించు పవిత్ర ప్రేమాంజలిని స్వీకరింపుము.

———

# అక్బరునిర్వేదము.

నాగొప్పతన మంగీకరింపడట-ఏమీ ఈ రాజపుత్రుని పెంకెతనము? కాదు కాదు. పెంకెతనముగాదు. దురభిప్రాయపడుచుంటిని. అతని మాతృదేశారాధనాదీక్ష వర్ణనాతీతము...సర్వ నాశనమైనను పట్టువిడువక పోరాడుచున్నాడు. ఇప్పుడు నేనెవరితో పోరాడవలెను?- ఆ వచ్చువారెవరు?- దట్టీయందమర్పబడిన వరలోని చంద్రాయుధము, నిర్విచారముగ నటునిటూగుచుండ. తటిల్లతవోలె, తళుకు తళుక్కని మెఱయుచు, అశ్వశిక్షయందారితేరిన రౌతువోలె దన "పంచకళ్యాణి" ని విలాసముగ కదనుద్రొక్కించుచు, పోటుబంటుల శవాకారముల నొకగంట దిలకించుచు, యథేచ్ఛగ వీరవిహారము సల్పుచుండిన యావ్యక్తి యెవరు చెపుమా? స్త్రీమూర్తియా? సమీపించుచున్నది... అదిగో! ఇంకను సందేహమేల?...ఫాలభాగమున లయ దప్పకుండ ముంగురులు చిందులు ద్రొక్కుచుండ, వెలలేని విమల ముక్తాదామము సగర్వముగ నాట్యముసలుపుచుండ, పుష్యరాగముల మాడ్కి నందందు గండభాగమున గ్రమ్మిన చెమటబిందువులను, దన కోమల కరకమలముతో కొనగోట రాల్చుచు, కళ్ళెము నొకచేత లాగిపట్టి దిశలు బరికించుచున్నది...ఆహా

ఏమిది? కనులకు మిరుమిట్లుగొల్పు దివ్యమంగళ స్వరూప సందర్శనభాగ్యము లభించినది...నిలింపకామినియా? మోహినీదేవియా? కాదు-కాదు-చేరువగుచున్నకొలది మరింత స్పష్టమగుచున్నది... భీభత్సరసమున కాటపట్టగు రక్తాంబర ధారిణి...ఎంతలో నెంతమార్పు? శృంగార రవ స్వరూపిణి రుద్రమూర్తియై పోయినది. చిగురాకు మోవిబిగించి కను బొమలు ముడివడ, ముక్కుపుటములు స్థూలమగుచున్నవి. దేదీప్యమానంబులై చంచలములై, సిరుల కాలవాలమగు నేత్రద్వయము, క్షణములో విప్పారి, భయంకరముగ నగ్ని కణముల రాల్చుచున్నవి. లలితమై ఆనందదాయకమై యొప్పు వదన మందిరమెర్రబారి యదరుచున్నది అదుగో! ఆవంక కే-నన్నే బిలచుచున్నది అరరే దూకినది...ముడి వీడి కేశపాశములు వెన్నునగుచ్ఛ గుచ్ఛములుగ విరియ బడ క్రిందికి దుమికినది-ధగద్ధగాయమానంబగు కత్తిని ఝుళిపించుచున్నది...ఆ- తల్లీ! ఏమనుచున్నావు? పాలేశ్వ రివా? నీవు పాలేశ్వరివా "మేవాడ్ రాజ్యమునకు పాలకు లము మేమే బొందిలో జీవములున్నంతవరకు, నీ సార్వభౌ మత్వమును, నీ నిరంకుశాధికారమును సమ్మతింపము- సాగ నియ్యము"-అనియా యనుచున్నావు? దేవీ! గ్రహించితిని మేవాడ్ రాజ్యము మీదే, ముమ్మాటికిమీదే. వలదు... వలదు, నాకీ చక్రవర్తి బిరుదమనవసరము స్త్రీలుసైతమస మ్మతిని జూపుచు, త్యాగవహ్ని కాహుతి యగుచున్నప్పుడు

పరిపాలన మెట్లుసాగగలదు? అజ్ఞానాంధకారమునబడి, స్వాతిశయమున వైరమును బెంచుకొని మిమ్ముగ చాట్లపాలు జేసితిని. పరమపవిత్రమై పూజనీయమైన స్త్రీజాతితో యుద్ధముసేయజాల, మీదేశభక్తి యనిర్వచనీయమైనది, హైందవనారీరత్నము లింత రణప్రియా కుతూహలురని యెఱుంగ. దేవీ! అనాదియమై న్యాయసమ్మతముగ మీ హక్కు భుక్తములలోనున్న మేవాడ్ రాజ్యము మీదే అవిచ్ఛిన్నముగ నేలుకొనుడు. మఱియొక దుర్గముగూడ కానుకగ మీకర్పింతును, ఉభయులము సరిసమానులమై దేశసేవ జేయుదము. దేవీ! శాంతింపుము. అల్లాహో అక్బర్!

శా॥ క॥:— ఈ వ్యాసము ననుసరించి, పద్యములు వ్రాసి, ఈశీర్షికతోనే, నాళం కృష్ణరావుగారు "వానవి" యందు ప్రచురించిరి. (ది 1 10-1932)

——

# త్రిలోకాలు.

## I

### నరకలోకము.

అతడఖండ తెలివితేటలు గలవాడేగాని దురాశా పీడితుడు. అతడు కట్టుకొన్న గాలిమేడలు కూలిపోయినవి. దరిద్రి మాతన్ని వరించింది. శతకోటిదరిద్రాలకు, అనంత కోటి ఉపాయాలు వెతికాడు. చిత్తచాంచల్యమేర్పడది. కష్ట పరంపరలు వెన్నంటి తరుముచున్నవి. జీవితముదుర్భరమైం ది. కవులో అధికమాసమువలె, లేమిడిలో బిడ్డలుపుట్టారు. భరింపలేని క్షుద్బాధను తీర్చుకొనుటకు మోసకృత్యాలుచే యవలసివచ్చింది. జాడ్యగ్రస్తులగు ఆలుబిడ్డల దురవస్థచూ చి సహించలేకపోయాడు. సన్నిహితబంధువులకు స్నేహితు లకుదూరమైనాడు. అతడిమీద లేనినిందలువచ్చిపడుచున్నవి. ఇతడు నీచుడని జనులందరు చెప్పుకున్నారు. ఆత్మవిశ్వాస మతనికి నశించింది. 'నా'అన్నదిక్కులేక, మితిలేని యిక్క ట్టులకులోనై, కృశించిపోతున్నాడు. లోకమతనినిజూచి నవ్వు తున్నది. జీవితాన్ని చక్కబెట్టుకొనే తెలివితేటలుండిగూడ, నిలుకడలేని మనస్సుతో అతడు తప్పుదారిద్రొక్కి విపరీతా వస్థలకు చిక్కాడు. ఆనందప్రదమగు ప్రపంచ మాతనికి

హేయమై, పాపభూయిష్ఠమైపోయింది. తుట్టతుదకు మృత్యు దేవతనారాధించి, విఫలమనోరథుడైనాడు. గత్యంతరంలేక "నేను మహాపాపి ననుకొన్నాడు." ఏపాపం చేశాడో? ఇంత కన్నా నరకమేముంది?

## II

### స్వర్గలోకము.

అతడు సౌందర్యోపాసకుడైన ఆనందమూర్తి. అన్య విషయము లాతని చెవికెక్కవు. ఒకప్పు డాతడు రమ్యహర్మ్యాంతర్భాగాలలో, తూగుటుయ్యాలలందు నిజకాంతలతో సరససల్లాపాలాడుతూ, ప్రియదూతిక లందిచ్చు కప్పురపు విడెముల స్వీకరిస్తుంటాడు. వేరొకప్పుడు మధుమాసపు మధురవెన్నెలలరేల లేదోటలందలి లతానికుంజాలమధ్య చంద్రశిలావేదికమీద యిష్టసఖులతో దివ్యాసవమానుతూ వుంటాడు. మరొకప్పుడాతడు సైకతస్థలములయందు వేడుక చెలికానితో విహరిస్తూ, సెలయేటిసంగీతమునజోడించి పాడు చున్న కోకిలప్రణయగీతాలనాలకిస్తూ, మలయమారుతంతో దోబూచులాడుకొంటాడు:- ఇంకొకప్పుడు వలపులరాణితో జలక్రీడలాడుతుంటాడు—దాసదాసీజను లాతని కనుసన్నల మెలగుతుంటారు. రాజెవడో, రెడ్డెవడో ఆతనికి దెలియదు;

చీకుచింతలతనిదరిచేరడానికి భయపడతాయి. లోకమంతా అతనికి శృంగారమయము. జీవితాంతమువరకు ఈలాగేజరుగుతుందని అతనికి నమ్మకము.

సమర్థించుకొనే తెలివితేటలుంటే, యింతకంటె వేఱొకస్వర్గము లేదనిఅతనిమనోనిశ్చయము.నిజానికంతేగా?

## III

### ఉత్తమలోకము.

అతడు కష్టసుఖాలకతీతుడైన త్యాగమూర్తి. సంతృప్తియే అతని కవచము. అతడొకచోట నివాసమును స్థిరపఱచుకొనలేదు. లోకమంతా అతనిదే. జగత్కల్యాణమే అతనికి మంగళప్రదము. ఎవరికి యేబాధకలిగినా అతనిదే ననుకొంటాడు. 'నా'అనేవాళ్లు లేరని అతడు చెబుతుంటాడుగాని, మానవులందఱు అతని తోబుట్టువులే. ఉత్తముడు, నీచుడు అనేభేద మతనికి లేదు.

ఎక్కువ భోగమనుభవిస్తున్నట్టు కనిపించినా, అందఱికంటె యెక్కువ కష్టమనుభవిస్తుంటాడు. ఏమహాక్లిష్టపరిస్థితులలోనైనా అతనిపెదవులనుండి చిఱునవ్వు జారిపోలేదు శాంతమంతాఅతనిసొమ్ము. పరోక్షంలోవుండేవిరోధులంతా

ప్రత్యక్షంలోకివస్తే అతనికి లోబడతారు. అతడు జీవితాన్ని సమర్థించే నేర్పుగల మహానాయకుడు. ఆత్మశక్తిని పెంపొందించి ఆనందిస్తుండే గొప్పయోగి. అతని స్థూలదేహ మొకచోటనున్నా సూక్ష్మదేహ మందఱి హృదయమందిరాల్లోను వుంది. ఇంతకంటె ఉత్తమపురుషు డెవడు? ఇంతకంటె ఉత్తమ లోకమేది?

---

# హిందూ సుందరి.

* * *

రాజాధిరాజు ముద్దుబిడ్డవు, అతి సుకుమారవతివి, అమిత లావణ్యవతివి, — నీ హృదయము నవనీతకోమలము, ఆకార మానందప్రదము.

అతడి కేలడానికి రాజ్యం లేదు, ధరించడానికి దువ్వలు లేవు, కనుసన్నల మెలగడానికి సేవకులు లేరు, వీటిఅన్నిటి కేమిగాని, "అల్పాయువు" కనినంత నేగుండెబ్రద్దలవుతుంది

---

తల్లిదండ్రులుతెగదన్నారు, బంధువులువలదన్నారు, చెలికత్తెలు శిరమూపారు.

ఎంత సాహసము? సుందరీ! ఎంతటిమనోనిశ్చయము? అక్రమమునకు వెఱచి, అధర్మానికి లోబడక, నిజమనోనాయకుని అల్పాయువునా పరిణయ మాడితివి?

దినములు లెక్కపెట్టుచూ, ఆత్మశక్తిని వృద్ధిజేసుకొనుట కనివినియెరుగని యమధర్మరాజునుజూచుటకా? ఆహా! తపోమహిమ!

మహాభయంకరములు, సింహశార్దూలాదిక్రూరమృగాలు దిరుగుదుర్గమారణ్యాలుదాటి, బుసలుగొట్టుచూవచ్చే

త్రాచుపాములనుతప్పించుకొని, భీభత్సమునకాలవాలమగు వైతరణినిదాటి యమలోకాని కేగుట? ఇవన్నీ ఒకయెత్తు,

రుద్రమూర్తియగు యముని, చండశాసనుడగు యముని నీతపోశక్తిచే పాతివ్రత్యమహిమచే, గడగడలాడించి, ప్రాణపతిని సంపాదించు టొకయెత్తు. సుందరీ! ధన్యచరితవు. నీశక్తిసామర్థ్యాలు వర్ణనాతీతములు.

ఇట్టి లలనారత్నములున్న, భరతిమాత కేమిలోటు? మేమెందుకు గర్వపడకూడదు? '

---

# మన స్థితిగతులు.

ఇప్పుడు?

అప్పుడు?

ఈ మార్పు లాభదాయకమా ?

వ్యాపారము మందగించింది. వృత్తులు నశించినయి. జీవనాలు పడిపోయినయి. తన్మూలకంగా నిర్వ్యాపారులైన యువకులనేకులు తప్పుదారిత్రొక్కి చెడిపోతున్నారు. దేశం అన్నివిధాలా అధోగతిపాలైంది. కాని చదువుకొన్నవారిసంఖ్యమాత్రం మునుపటికంటె పెరిగింది. ఈచదువే పైవాటి కన్నిటికి మూలకారణమని కొందరివాదన.

ఇందలియథార్థం తెలుసుకోవాలంటే, తీవ్రాలోచన అవసరము.

మొన్నమొన్నటిదాకా—అంటే, మొదటిసత్యాగ్రహోద్యమానికిపూర్వమువరకు మనలో చదువుకొన్నాళ్ల సంఖ్య చాలాస్వల్పం. ప్రజలలో ధనవంతులున్నా, అమాయకులుగానుండేవాళ్లు ధర్మానికినీతికి చాలామట్టుకు కట్టుబడి వుండేవాళ్లు-రాజశాసనాని కెంతభయపడేవారో, పూర్వాచా

రాలన్నా, అయ్యవార్ల(అగ్రజాతుల)మాటన్నా, అంతభీతావహులై యుండేవాళ్లు. చిన్నచిన్న గ్రామనౌకర్లకు, పోలీసు బంట్రోతులకుకూడా, జనసామాన్యం వంగి వంగి సలాములు పెడుతుండేవాళ్లు.

ఆరోజుల్లో సంఘుపుకట్టుబొట్లుమహాకఠినంగావుండేవి. చాకింటిగుడ్డలు పసుపునీళ్లు చల్లితేనేగాని పనికిరావు. విద్యార్థులకు స్కూలుదుస్తులు వేరు—ఇంట్లోధరించేవివేరు. ఆచారవ్యవహారాలను పాటించనివారిని నేరస్థులుగాభావించేవారు. ఇంతెందుకు? సముద్రయాన మొకగొప్పతప్పు సీమకువెళ్లి వచ్చినవారిని సంఘు మానాడు బహిష్కరించింది.

ఆనాడు నాటకసంఘాలు అక్రమసంఘాలు, నాటకాలువేసేవాళ్లనుజూస్తే ప్రజలు అగౌరవించేవారు. ఏయువకుడైనా ధైర్యంజేసి నాటకంలో వేషంవేస్తే, ఆనాటిలగాయితు అతన్ని "నాటకాల్లో దిరిగే సోమరి" అని తేలికమాట అనేవారు.

పురుషుసంగతే యిలావుంటే, ఇక స్త్రీలసంగతి అడుగనే అక్కరలేదు. వాళ్లకు పూర్తిగా నిర్బంధావాసమే.

అప్పటి గోల యిది ...
ఇప్పుడో?

అంతా తారుమారైంది. విద్యాధికులసంఖ్య అప్పటి కంటే చాలా పెరింగింది. నానాదేశవిజ్ఞాననాగరకతలు ముదిరినయి. మనయువకులు అన్నిరాజ్యాలకు వెళ్ళారు. అన్నిటికి తయారైనారు. చదువుకోసం ధనధనేతరాలు ధారవోశారు. భయభక్తులు నశించినయి. ఎంతపెద్దఉద్యోగికైనా, జనసామాన్యంభయపడరుసరేగదా,—అవసరమైతే ధిక్కరిస్తారుగూడాను. సంఘపు కట్టుబాట్లను, దురాచారాలను ప్రతివారు సునాయాసంగా దాటేస్తున్నారు. తీవ్రంగా విమర్శిస్తూ, వ్యతిరేకప్రచారం చేస్తున్నారుగూడాను.

స్త్రీలుగూడా ముందంజవేశారు. పురుషులకంటె మేము తక్కువేమిటని, అన్నివిషయాల్లోను ప్రత్యక్షమవుతున్నారు. నిజంగా, రాణిస్తున్నారుగూడాను.

కాని,... వీటన్నిటితో పాటు, నీతినియమాలుకూడా చెడిపోయినమాట వాస్తవమే... చెడిపోకతప్పదు.

ఒకచోట తరిగితేనేగాని, మరియొకచోటవృద్ధిగాదు. ఇది సృష్టిరహస్యము. అవ్వాకావాలి, బువ్వాకావాలిఅంటే యెలావస్తుంది?

దేశంలో ధనికులసంఖ్య తగ్గిపోయింది. విద్యాధికుల సంఖ్యపెరిగింది.—సంఘసంస్కర్తలుప్రబలమైతే, పూర్వాచారపరాయణులు సన్నగిల్లారు. అన్నిటిలోను అఖండమైన మార్పు వచ్చింది.

ఈ మార్పుకు కారణం, ఈవిద్యయే నంటారా? అని అంటే?

సందేహము లేదు. చాలాభాగమంతే?

కసాయివాడు పెంచిన చిలుక కసాయిమాటలు మాట్లాడదూ?

ఆత్మవంచన— అవినీతి—అక్రమము—అశక్తి—అహంకారము—మోసము—మున్నగునవన్నీయీవిద్యలోనే మిళితమైయున్నయి.

ఈనాటి విద్యార్థికి డెన్ని యబద్ధాలకైనా వెరవడు. ఏకోదరసోదరుడైనా, మోసగించుటకు వెనుదీయడుసరేగదా లెన్ను తానే నమ్మడు,

కాబట్టి ఈవిద్యమనకు లాభదాయకంగాదంటారా? ...అని అంటే?

కాదని యెవరూ అనలేరు.

కష్టసుఖాలవలె లాభనష్టాలు కలిసేవుంటయి. చీకటి వెన్నంటె, వెన్నెల వుంటుంది.

ఎలాగంటారా?

ఇతర దేశాలతో సంబంధబాంధవ్యాలు కలుగడానికి ఈవిద్య కారణంగాదూ?

ఇతరదేశాలతో సరిసమానంగా మనంకూడా వుండాలని ప్రయత్నించడానికి కారణం యీవిద్యగాదూ? ఇతరుల వ్యాపారరహస్యాలు తెలుసుకొని మనంకూడా వ్యవహరించుటకు కారణ మీవిద్యగాదా?

ఒకటేమిటి—అన్నివిషయాలలోను ఇతరులను జూచి మనము దిద్దుకొంటూనే యున్నాము.

పరులు మనల ననుసరిస్తున్నారా, లేదా? అంటే? లేదని చెప్పలేము.

కాబట్టి సహజంగా కొన్నికీడులు, కొన్ని మేళ్ళు వుంటయి.

సరే... అయిందేమో అయింది...ఇక ముందుగ తేమిటంటే?

విద్యార్థులబుద్ధి మారిపోవాలె.

అందరికి ఉద్యోగాలెక్కడదొరుకుతెయి? చదువు కేవలము ఉద్యోగాల కోసము మాత్రమే కాదురా బాబూ అని విద్యార్థులు గ్రహించాలె. మోజాలు తుడిచే నీచవృత్తికి పాలుపడకుండా, యెవరికి వారు, దీర్ఘంగా ఆలోచించుకొని, తల కొక దారి చూచుకోవాలె.

డిగ్రీలులేనివాళ్ళుకూడా, మనలాంటిమనుష్యులే, మనకంటె తెలివిగలవాళ్లే అని విద్యార్థులు భావించాలె.

మనసుంటే మార్గమున్నది. ప్రప్రథమంలో కష్టపడ్డా పిదప సుఖం రాకపోదు.

ఎన్నిరకాల వ్యాపారాలులేవు? ఎన్నివృత్తులు లేవు? ఎన్నిచేతిపనులు లేవు? బుద్ధిబలముంటే గోచరించవూ?...

కాని ... ఇందుకు ధనవంతుల సహాయమవసరము. ఉన్నధనవంతులు స్వల్పసంఖ్యాకులైనా, శక్తికొలది విధిగా తోడుపడవలసిందే. అప్పుడు అన్ని చిక్కులు తీరిపోతయి.

సంపన్నులధనంతో, విద్యార్థుల బుద్ధిబలముపయోగిస్తే దేశం బాగుపడుతుంది.

ధనవంతుల కీయాలోచనలు రుచించవంటారా? ధనవంతు లిందుకు సమ్మతించకపోతేనా? కొన్నాళ్లకు మిట్టపల్లాలేకమవుతయి... కాక తప్పదు.

పరిస్థితులే ఆపనిచేయమని బలవంతపరుస్తయి.

అప్పుడెవరేమిఅనుకొన్నా ప్రయోజనములేదు, పదిమందితోచావు పెళ్లితోసమానమంటారా?

సరే... చెప్పేదేముంది?

---



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA/05B(T) |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | prathyusha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Rukshana |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |